SREE

# RANGARAYAKADANA SAMAVAKARAM.



*An Historical and Original Telugu Drama in three Acts*

BY

**KALLAKURY SAMBASIVA ROW** F.A.,

*Teacher, Pittapur Rajah's College, Cocanada.*



FIRST EDITION 1000 COPIES.

COCANADA.

Printed at the SUJANARANJANI PRESS, by the Proprietor, P. Brahmananda Row, and published by the Author.

1899.



PRICE 6 ANNAS.

# రంగారాయకదన సమవాకారము.



ఇది

కాకినాడ పిఠాపురంరాజాగారి కాలేజీలో నుపాధ్యాయుఁడగు

కాళ్లకూరి సాంబశివరావుచే

రచియింపఁబడినది

మొదటికూర్పు



కాకినాడ

సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి

గ్రంథకర్తగారిచేతనే ప్రకటింపఁబడెను.



దీనివెల 6 అణాలు.

# పీఠిక.

ఆంధ్ర భాషాభిమానులారా !

ఇది గడచిన 1757 సంవత్సరము జనవరినెల 26 తేదీని బొబ్బిలివారికిని విజయనగరం మహారాజులుగారికిని జరిగిన యుద్ధకథ. ఇది ప్రబంధముగాను, ద్విపదగాను, పాటగాను రచింపఁబడి పండితపామరుల కమితానందంబు సంధిల్లఁజేయుచున్నదని నేనువేఱే చెప్పనక్కఱలేదు. అట్టి సంతోషమునకుఁ గారణము బొబ్బిలిజనుల శౌర్యాతిరేకమేగాని కథారచనా చమత్కారము గాదు. దృశ్యప్రబంధముగనుండినఁ జూపరుల కపరిమితానందంబు గల్గుననియెంచి స్నేహితులచేతఁ బ్రేరేపింపఁబడి యీకథాసరళి కొంచె మించుమించుగ సమవాకార లక్షణమును బోలినహేతువుచేత సాధ్యమైనంతవఱకు దానిననుసరించినాఁడ. రసభరితములగు కృతులనొనర్ప సమర్థులగు కవిశ్రేష్ఠులఁ బోలకున్న నాంధ్రభాషయం దభిరుచిగలవాఁడనగుటచే శక్తికొలఁదిని బ్రయత్నించితిఁగాని ప్రప్రథమరచనా గ్రంథమగుటచే నిందు దోషములుండకపోవు. మార్పులు కావలసియున్నచోట్ల నాంధ్రభాషాధురీణులు దయతోఁ దెలియఁజేసినం గృతజ్ఞతాపూర్వక వందనములతోఁ గైకొని రెండవకూర్పునందు సవరించుకొనుచున్నాఁడను. ఈగ్రంథరచనలో దిట్టకవి నారాయణకవికృత రంగారాయచరిత్ర కడుసాహాయ్యం బొనర్చినది. మఱియుఁ గొంత వృత్తాంతము కార్మికెల్ దొరవారు వ్రాసినవిశాఖపట్టణం డిస్ట్రిక్టుమ్యాన్యువల్ నుంచి కొంత యారమ్ ధొరగారు వ్రాసినచరిత్రనుంచి కొంత శ్రీ బొబ్బిలిరాజావారి ముఖస్థముగను గ్రహింపనయ్యె. సాధ్యమైనంతవఱకీ గ్రంథస్థమగుచరిత్ర వాస్తవమని నొక్కి చెప్పఁగలను. ఇక్కథానాయకుఁడగు శ్రీ గోపాల కృష్ణరంగారావు వారికినిప్పుడు బొబ్బిలిసంస్థానంబు నేలుచున్న శ్రీ రాజా మెహర్బాని, దోస్తాన్ శ్రీ రాజారావు వెంకట శ్వేతాచలపతి రంగారావుబహద్దర్, కే.సి.ఐ.ఇ. వారైదవతరము వారగుటచే నీగ్రంథము వారియభిమాన చారిత్రాభివర్ణనమేగాన వారికే కృతినియ్యఁదలఁచి, గడచిన జూన్ 30 తేదీని శ్రీవారిసభలోఁ జదివి వారికిఁ గృతినొసంగినాఁడను. శ్రీ రాజావారు నమిత భాషా సరసులగుటచే రసంబుగ్రహించి యపరిమిత సంతోష సంపూరితాంతఃకరణులగుచు నన్ననేకవిధంబుల సన్మానించినదేగాక యీగ్రంథము నచ్చొత్తించుభారంబును వహించిరి శ్రీ వారికిని వారికుమారరత్నములగు శ్రీ వెంకటకుమార కృష్ణరంగారావుగారికిని శ్రీ రామకృష్ణ రంగారావుగారికిని దైవ మనిశంబు శ్రేయంబులనొనగూర్చుఁగాత.

కా. సాంబశివరావు.

## ఇష్టదైవస్తుతి.

శా. శ్రీనాథోర్వీసుమేరుభూధర సురజ్యేష్ఠాగమాజ్ఞార్కుఁ లిం
పూనన్ రాజదజింహగోరురథ ధర్మోగ్రేద్ధసవ్యేష్టకా
జానేయవ్రజచక్రయుగ్మమయి చంచద్ఘోరసంఖ్యంబులో
నానక్తంచర కాలనంజ్ఞపురదిష్టాంతంబుఁ గావించి మేల్
క్షోణిన్నింపిన సాంయుగీనున కెదన్ జోహారుఁగావించెదన్.

## కృతిపతిస్తుతి.

శా. శ్రీరాజీవభవాండమండల ఫలస్ఫీతంబు దివ్యద్యశ
స్సారభ్యప్రథితంబు సద్గుణ సుమస్ఫారంబు కామప్రదం
బారూఢాత్మకవీంద్ర చిత్తమధుపౌ ఘాసేవ్యమానంబునౌ
శ్రీరంగాధిప కల్పకంబు విజయశ్రీనేలు రంగాధిపున్.

క. రాజునహిరాజు నంబుధి
రాజు నుమారాజు నద్రిరాజు నఖిలగో
రాజు హసియించి బొబ్బిలి
రాజుల సత్కీర్తి దిగ్విరాజులవేలున్.

సీ. చక్రరక్షణకళాశాలి యాతండని చక్రరక్షణకళాశాలియగుచుఁ
గమలాధికామోదకారి యాతండని కమలాధికామోదకారియగుచుఁ
సతతసన్మార్గసంచారి యాతండని సతతసన్మార్గసంచారియగుచుఁ
బ్రకటాఖిలలోక బాంధవుండతఁడని ప్రకటాఖిలలోక బంధువగుచు
గీ. శూరుఁడాతఁడని త్రిలోకశూరుఁడగుచు
నాప్రభాకరుతో నీప్రభాకరుండు
సాటియననొప్పితివి రాజసార్వభౌమ
రంగరాయనృపాల శ్రీరమ్యశీల!

గీ. మీకులమువారిదైవ నమీకచరిత
మొ, సమనాకారముగఁ జేసిమీకుఁగృతి నొ
సంగుచున్నాఁడఁగొనుఁ డగ్రజాత్యకాళ్ళ
కూరి సాంబశివామాత్య ధీరుఁడ, నిదె.

# ఈరూపకమునందలి ప్రధానపాత్రలు.

---

రంగారావు—బొబ్బిలిరాజు

వెంగళ్రాయఁడు—రంగారావు తమ్ముఁడు

చినరంగారావు—రంగారావు కుమారుఁడు

దామరదమ్మన్న
ధర్మారావు
చెలికాని వెంకయ్య
తాండ్ర పాపయ్య
పంతెన బుచ్చెన
} రంగారావు బంధు మిత్రవర్గము.

విజయరామరాజు—విజయనగరం మహారాజు

జగన్నాథరాజు—విజయరామరాజు మంత్రి

వత్సవాయాన్వయుఁడు—పెద్దాపురంరాజు

బుస్సీ—ఫ్రెంచి గవర్నరు

హయిదరుజంగు—బుస్సీమంత్రి

గోరుందొర—కమాండరించీఫు

లక్ష్మన్న—బుస్సీ దుబాసీ

మద్దాల రెడ్డినాయఁడు—గోరుందొర దుబాసీ

నాగోజీరావు—హయిదరుజంగు గుమాస్తాలలో ముఖ్యుఁడు

లూయిస్ మర్టెన్—గోరుందొరంపినవకీలు

లా, రాసూ, లాడమూఖాన్, లాసుఖాన్, హసనల్లీఖాన్
సుకురల్లీ, సిద్దిబిలాల్, కుప్పి, కుప్లాము
} ఫరాసు పారసీకపు జోదులు

మల్లమ్మాదేవి—రంగారావు భార్య

శ్రీరస్తు.

# శ్రీరంగారాయకదన సమవాకారము.

## ప్రథమాంకము.



నాంది

శ్రీరంగావనినాథుఁ డాపృథితలక్ష్మీసంశ్రయుం డాశ్రితా
ధారుండుగ్రరణప్రమోది విజయోదారానుగుండంచితా
చారుండూర్జితుఁ డప్రమేయుఁడు గుణస్ఫారుండు మీనధ్వజా
కారుం డెల్లపుడిచ్చు మీకు నిఖిలాఖర్వప్రభాశ్రీయముల్.

(నాంద్యంతమున)

సూత్ర—నటీ! ఇటురమ్ము.

నటి—చిత్తము. ఆర్యపుత్రా! ఏమి సెలవు.

సూత్ర—ఇప్పుడిచ్చోటఁగూడియున్న సభం దిలకించితివా?

నటి—చూచుచున్నానార్యసుతా.

సూత్ర—నటీ! ఈసభ, సుధర్మంబోలె విబుధమండల విరాజితంబై, కాసారంబు రీ రాజహంసాశ్రయంబై, కైలాసంబు భాతి సదార్యానుకూలంబై, కరిపురంబు వడ పున గౌరవయోగ్యంబై, బ్రహ్మగేహంబు కైవడి భారతీనిలయంబై, యలకాపురం చెన్నున ధనదప్రధానంబై, కలశార్ణవంబు కరణి సంపజ్జనకంబై యొప్పుమీఱుచున్న చూచితే?

నటి—పండితపుత్రా, నిజము. ఇప్పుడేమనియెదు?

సూత్ర—నటీ! వీరియుల్లంబులు పల్లవింప నేఁడేని యొక్క యపూర్వకథాప్రసంగం నడపవలెనని.

నటి—అట్లైనఁ గానిమ్ము, కాని సమస్తదృశ్య ప్రబంధంబులును ప్రదర్శింపఁబడిన

సూత్ర—నటీ! నీవెన్నఁడైన రంగారాయకదన సమవాకారంబన వినియుంటివే?

నటి—లేదు. అదెట్టిది?

సూత్ర—నటీ! అది బొబ్బిలి వెలమదొరలకును, విజయనగరము రాజునకును జరిగిన యుద్ధకథ.

నటి—అట్లైన నదియపూర్వమైనదే. దీనినెవరు రచించిరి?

సూత్ర—చెప్పెదవినుము.

సీ. కాశ్యపార్యాన్వయకలశపాథోరాశి రాకానిశీథినీరాజవరుఁడు
సప్తర్షివర్యసందీప్తభారద్వాజ సత్పోధనగోత్ర సంభవుండు
ప్రస్ఫుటభోగరాట్పాపమాంబా గర్భశుక్తిముక్తామణిస్ఫూర్జితుండు
హూణాంధ్రభాషా మహోన్నత శేముషీ వైదుషీ విశ్రుతిభాసురుండు

గీ. సాంబశివరాయ కవిబుధజనవిధేయుఁ
డిదిగొ రచియించె బొబ్బిలికదనచరిత
ముసమవాకారముగ రసస్ఫూర్తి యెసఁగ
సకలజనమానసాహ్లాదసరసఫణితి.

నటి—నీయంతటనీవే ప్రదర్శింప నెంచితివా? లేక సభ్యుల యనుమతమా?

సూత్ర—నటీ! నాయిష్టముగాదు. వారలేకోరిరి.

నటి—సరే. సభ్యులంతగొప్పవారని యంటివే! ముచ్చటదీరునట్లు వారినెట్లు రంజింపగలుగుదుము.

సూత్ర—నటీ! ఎంతవెఱ్ఱిదానవు మూర్ఖుల రంజింపఁజేయుట కష్టముగాని ధీరులను రంజించుటెంతపని,

గీ. రాజహంసలు క్షీర నీరములువేఱు
పఱచిక్షీరంబెగ్రైకొని పరఁగుపగిది
సుగుణదోషములేర్పడఁజూచిగుణమె
గైకొనంజాలు వారలుగారెబుధులు.

నటి—ఆధైర్యమే నీకున్నచో నుద్యోగింపుము.

సూత్ర—మున్నుగ దత్సూచకంబగు శరదృతువర్ణనం బొనర్పుము. నటీ!

నటి—ఆపనికి నన్నే నియోగించితివా! కానిమ్ము. ప్రయత్నించెదను.

చ. శరములు నిర్మలత్వమున జాలుకొనె న...

శరములు పల్లవించె నలశారదలక్ష్మి మదుంగులోయనన్
శరములుపూని శాత్రవులు జన్యములం బచరింపసాగిరీ
శరదమలాంబుదంబులు ప్రసన్నములై ప్రబలెన్నభంబునన్.

చ. సురుచిరురంగరాయని యశోరుచులీసరణిన్ బ్రశస్తవై
ఖరిఁబ్రసరించెనావిశదకాంతి శరద్వరచంద్రికల్ దిగం
తరములనిండె మార్తికసుధారజతావని భృత్సురాపగా
సురభిపటీరహీర శరసూనములన్ హసియించిమించుచున్.

సూత్ర—ఆహా!

గీ. హాయిగానీవు గావించినట్టిశార
దాభివర్ణనము సుమనోహరిమై స్వ
భావసిద్ధంబునై యిప్డు ప్రబలుచునికి
నీదుచాతుర్యమే వర్ణనీయమయ్యె.

నటి—సరే! నాపాట కసూయఁజేయక సంతసించితి వింతేచాలును.

సూత్ర—సుజనుల తెఱంగది గాదుగదా!

క. "దిద్దవలెఁ దప్పుగలిగిన
ముద్దుగనైఘంటికంబు మూలముగనితా
రెద్దియుఁజూడక రోసెడి
గద్దరి కుమతులను లెక్కగొంతురె సుమతుల్."

ఇంతేగాక మున్ను.

క. అలబొబ్బిలిరావుకులీ
నులయున్నతిఁగాంచి యోర్వనోగిలియసూయా
కులుఁడైన పూసపాటిన్ప
తిలకుండేపాటికీరితిన్ జెందెనిలన్.

నటి—త్రైలోక్య విజయుండగు విజయరామరాజు కొల్వుండు తఱియయ్యె చాలుంజా
లు! మనమీపాటి పోవుదముపద.

సూత్ర—అవు నది నిజమే.

అని నిష్క్రమించుచున్నారు.

ఇది ప్రస్తావన.

రంగము :—విజయరామరాజు సభ.

[ విజయరామరాజు, మంత్రి జగన్నాథరాజు ప్రవేశించుచున్నారు ]

రాజు—మంత్రిపుంగవా !

మంత్రి—మహాప్రసాదము రాజా.

రాజు—నామనంబు చింతాకరంబయ్యెఁగదా ! సౌఖ్యరాహిత్యంబగు వైభవమ్ము మరాళవర్జిత కాసారంబుగదా ! అడవిగాచిన వెన్నెలకైవడిని నాజన్మంబు సాఫల్యముబొందమికి నాడెందంబు గడుఁగుందుచున్నయది.

గీ. చింత చితియను రెంటిలోఁజింతఘనము
మానసంబుననూహింప మాన్యచరిత
విను చితికాల్చు నిర్జీవులను బుడమిని
జింతఁగాల్చును బ్రాణులజీవయుతుల.

మఱియును.—

గీ. అంతి పురమును విజనంపుటడవిగవని
నంతి పురముగఁదోఁపింప స్వాంతమోసుమ
కారణంబగు నన్యంబుగాంచలేదు
సచివమూర్ధన్యయదిగాదె జగతియందు.

మంత్రి—రాజేంద్రా ! వైభవమ్మున నింద్రుని, ధర్మంబున బలిని, పరాక్రమంబున రంగరాయుని మించి భూపాలుర నదిమి కప్పంబులుగొంచు దనయుర్వి కామధేనువునా విధి విధానమ్మున రాజ్యంబుసేయు మీకుఁగొఱంతగల్గునా !

గీ. అట్టిదుర్వ్యాకులంబేయహముఁగాని
పొందఁగారాదు మీవంటిపురుషులకును
విభవసంస్ఫూర్తిజిద్వృష ! విజయరామ
రాజ ! రాజన్యలోకమార్తాండమూర్తి.

రాజు—మంత్రివరా ! నీవెంతబోగడినను రంగారాయశబ్దము వినినప్పటియుండియు మానంబెరిసెడిని, ఏలనన !

శా. బాల్యంబాది యసంఖ్యమా యపకృతుల్ వారెన్నియో జేయసా

కల్యంబేర్పడ సావినోద్పడమి నేఁగార్పణ్యామొప్పారిత
త్తుల్యంబుల్ప్రచరింపఁజాలకయె మద్గోద్దర్పముంకింపకే
తౌల్యంబౌగతి నూరకుంటినిగదా లావెంతయున్గల్గినన్.

ఇంతేగాక

క. ఎన్నంగరాని దుష్కృత
పన్నగవిషబాధకోర్వజాలై తిని త
త్పన్నగవిషదంష్ట్రావళి
నెన్నిక మున్నున్న డుళ్ళనేయనయితిహా. !

గీ. గోటఁజిమ్ముదాని గొడ్డండ్లఁగొట్టంగ
వలసెనన్ననూట పాటియయ్యె
నయ్యనేమి వారి నాజిని హతులుగ
జేసి సార్థకంబుజేతునఖిధ.

మంత్రివరా! వైరిక్ష్మాజాని చక్షుఃశ్రవం బక్షీణోదగ్ర జిహ్వాగ్రంబులక్ష్వేళంబు గ్ర
క్కుచు క్షణక్షణంబును బొంచియుండ నాకెట్లు క్షేమంబుగల్గును ?

మంత్రి—రాజేంద్రా! పరమంబగు నొక్క యర్థంబుగలదు. దానినాకర్ణింపుము.

గీ. తుష్టికలదేని వనమునందున్నఁగాని
ద్రోఁచుసుఖముగజనునకుఁదుష్టిలేక
యున్నఁబురినున్న వనముననున్నరీతి
సుఖముఁబొందకయుండును జూడనరుఁడు.

రాజు—అది నిజమే, గాని పరాక్రమశూరులగు రాకుమారులకిల నరివరోర్వీవరులదు
బులం బరాజితులంజేసి వారి యుర్వీరమల గొనుట ధర్మముకదా !

శా. రత్నస్థాపితవస్త్యపజ్క్తియును శక్రస్వస్థసామ్రాజ్యమున్
నూత్నావాపక యక్షకర్దమసదన్యానోత్తరానంగముల్
యత్నోపార్జిత ఘోటకద్విపసమూహ ప్రాభవశ్రీలున
త్పత్నీరత్న కదంబమెల్లఁదులయే ప్రాంచద్యశోలక్ష్మికిన్.

కనుక మంత్రివరా !

గీ. కలితతజ్జయలక్ష్మి సంగ్రామసీమ
[illegible]

భూద్వితీయాభ్యుదయ కంతపూజ్యసూత్ర
పటలవిచ్ఛేదిగాని నాప్రాణమేల ?

మంత్రి—రాజేంద్రా! అట్టిధర్మంబరాతివీరులయెడఁ దగినదేగాని వారిత్తఱి మనలకపరాధంబేమియుఁజేసినవారుగారు, నిర్నిమిత్తోద్యద్రుషాపాటవంబున నిరాటంకంబగు యుష్మద్వాచాటనంబున శత్రురాజులఁ గెలువనేర్తుమే ? "యతోధర్మస్తతోజయ" మన్న శ్రుతులమనము వినియుంటిమిగదా ? ఎచ్చట నధర్మంబుండు నచ్చట నాశంబగు చింతింపనేల ! అయినను

పంచచామరము. బలాబలంబులెంచి పొంచిబబ్బిలినోర్వగావలెన్
హలాహలిన్ దురంబులో నరాతివీరసంతతిన్
ఝళంఝళారవంబులొప్ప శస్త్రముల్చరింపఁగా
భళాభళీయటంచు మింటబల్కుపర్వులార్వఁగన్.

ప్రియంవదావృత్తం. అరులగెల్వఁదటిదైనయప్పుడా
యరినరాధిపుని నాజిగెలువన్
గరువమేర్పడుసుగాని సమయం
బరయకుండ ననర్థమగునె.

జనపాలా ! నీకెల్లప్పుడు హితముగోరి సమయాసమయంబులారసి యరాతివీరుల నోర్వ కాలంబు సమకూడ నేనూరకుందునే ?

రాజు—అమాత్యవరా ! నీవు వాక్రుచ్చినది నిక్కువంబే, గాని, ప్రక్క నరివీర రంగరాట్పన్నగంబు బొబ్బిలి ప్రాకారవామలూర్వంతరస్థాయియై యుండెననుచింతయంతరంగకకుబంతకుహరపుటభేదనంబు గావించుచున్నది.

మంత్రి—రాజేంద్రా ! వినుమరాతివీరబలోద్రేకంబు మనకనుభవైకవేద్యమే.

గీ. వైరివీరులపారదుర్వారులనుచు
మక్కువాదిస్థలంబుల మనకుదేట
పడియెగా యింకనెందుకీపాటి చాడి
సమయమును వేచియుండుట చక్కనగును.

అదిగాక.

గీ. అచటఁబుట్టిన ననగొమ్మనైనఁజేవ

చేతరాజిలు వీరులఁజెప్ప నేల ?
ప్రథితబలరాజులతుల పరాక్రమమ్ముగ
రాజులారయ బొబ్బిలి రాజులెల్ల.

మఱియును.

గీ. వారిమాహాత్మ్యమెన్నంగవశమెమనకుఁ
జండదోర్దండకాండప్రకాండకాండ
కలనఁబెద్దలువారలు ఘనచమూర్ధ
తినిమనము పెద్దలము నిజస్థితినిగనుఁడు.

రాజు—నీవును వారిమహిమనే యెక్కుడుగఁదలంచుచున్నావా ?

మంత్రి—లేదు. రాజా! దురంబులకరుగనుత్సహించుతఱి నెదిరిబలంబును నిజబలంబును మనమాలోచించుకొనవలయును గదా! అందుకొఱకై జెప్పినాఁడను గాని వేఱుగాదు.

(కంచుకి ప్రవేశించుచున్నాఁడు.)

కంచుకి—మహాప్రభూ! మీదర్శనంబునకిద్దఱు బ్రాహ్మణులు వచ్చి ద్వారంబున వేచియున్నారు.

రాజు—సేవకా! వారినిటుల బిలుపుము.

సేవకుఁడు—చిత్తము. దేవరా! (అనియరుగుచున్నాఁడు)

(బ్రాహ్మణులు ప్రవేశించుచున్నారు)

రాజు—లేచి చేతులుమోడ్చి (ప్రకాశముగా) నమస్కారము. భూసురోత్తములారా!

బ్రాహ్మ—విజయీభవ. (అని యాశీర్వదించుచున్నారు)

రాజు—మేదినీసురలారా! ఇటుల నాసీనులగుడు.

బ్రాహ్మ—ఆసీనులగుచున్నారు.

రాజు—భూదేవోత్తములారా! ఎచ్చటినుండి విచ్చేయుచున్నారు ?

బ్రాహ్మ—భూవరా! వీరబొబ్బిలి సంస్థానాస్థానంబు వెలువడివచ్చుచున్నాము.

రాజు—అచ్చటివింతలేమి ?

బ్రాహ్మ—నరేంద్రా! అచ్చటివింతల నెంతని చెల్పుదుము. వత్సరంబునంగల ద్వాదశమాసంబులు విచ్చలవిడిజరించుచు నందందుల రాజచంద్రుల దర్శించుచు వారిమాహాత్మ్యంబులుచూచుచుంటిమిగాని యాబొబ్బిలిరాజన్యానేకపసింహాలంబోలిన శౌశ్య [illegible]

రాజు—(తనలో) ఏమిపొగడుచున్నారు. నేనుగూడ విశేషధన మొసంగితినా నన్ను నిట్లే యొండుచోటం బొగడుదురు.

బ్రాహ్మ—శా ॥ శ్రీమాటోపసుధీస్థిరత్వమహిమావిశ్రాణనాలిక్షమా
పామాణ్యంబుల నీసడింతురు సుమా పాండుద్వితీయాత్మజా
తామర్త్యాళిగురుప్రమేరురవిపుత్రానంతవర్గంబు నిం
కేమర్త్యుల్సమమౌదురిమ్మహినిదే యీరాజలోకంబునన్.

మఱియును.

గీ. అంటిపొడిచి వేగగంటువెంబడిదూరు
నదురుగుండె పిక్క చెదురులేక
మరమునందు రిపుల దుర్వారశక్తిచే
రాజవరుఁడు రంగరాయఘనుఁడు.

రాజా! ఆగోపాలకృష్ణరంగరాయ తుమావల్లభుప్రాభవంబు వర్ణింప వేనోళ్ళ చిలువకైనను దరంబుగాదు.

గీ. పుడమి నెంచఁజినో రాజపుంగవులను
గంటిమేగాని లేరిటువంటివారు
ధనమొసంగఁగుచేలుఁడు ధనదుఁడగును
శిక్షజేయఁదలంచిన శివుఁడడంగు.

గీ. పుణ్యజనులను గారింపఁబూనెరంగ
రాయుఁడనువాడు మాపె నీరంగరాయుఁ
డాత్మలోనఁదలంచినిరంతరంబు
పుణ్యజనులనురక్షించుపూనిక్కబూని.

రాజు—ఆహా! నిజమేనా! ఏమిపొగడుచున్నారు! బాపలకు పొగడుట నైజము. మీకువిశేష మొసఁగినవారే దానకర్ణులు. తక్కనగుణంబులెట్లున్నను.

మంత్రివరా! ఈబాపలను బంపివేయుము.

మంత్రి—మంచిది రాజేంద్రా. (అనివారిని బంపివేయుచున్నాఁడు)

బ్రాహ్మ—ఇదేమి. వారిని బొగడితిమనిగాఁబోలు మనలనువచ్చినదారిని బొమ్మనె. ఎంత వెఱ్ఱిపనిచేసితిమి? (అనుకొనుచుంబోవుచున్నారు.)

రాజు—మంత్రిపుంగవా! ఈబ్రాహ్మణుల వరన నిజమైనదియే?

మంత్రి—కొంత నిజమే. దానినతిశయముగఁ జెప్పియున్నారు. లోకమందిట్టిది యాచ
కులకు సహజమేగదా?

రాజు—సచివాగ్రణీ!

గీ. దానరాధేయులఁట సుప్రతాపశౌండు
లఁట యుపాయవిదులఁట సప్తాంగధుర్యు
లఁట తగన్వారు నేను గానఁట కను మిదె
తెలియు నాక్షాత్రమున్ వారి వెలమతనము.

(వారొనర్చిన యపకృతి నెదఁదలంచి) తలపంకించుచు (ప్రకాశముగా) ఈపట్ల
వారిని వదలివేయఁజనదు.

మంత్రి—(స్వాగతము) ఆహా! ఈరాజు రావువంశపయోధి సుధాంశుండైన గోపాల కృష్ణరంగరావు సరళీయరసి చూపోపక నిర్హేతుక జాయమాన క్రుధాకలితుఁడగుచు దుర్వ్యథచే బాధితుఁడగుచున్నాఁడు. బలాబలంబులం దెలుప నేనన్నమాటలచేతనే కుందుచుండఁగా గోరుచుట్టుమీఁద రోకంటిపోటన్నట్లు బ్రాహ్మణులుకూడ సమకూడిరి. కూడిరిబో శత్రురాజవర్ణనగూడఁ గావించిరి. దండతాడిత భుజంగంబుభాతి నుగ్రుఁడైయున్నాఁడు. (ప్రకాశముగా)

రాజాగ్రణీ! శాంతివహింపుఁడు. ఆరంగరావిత్తఱిఁదమకెట్టియపకారంబుఁజేసినవాఁడు? నిర్హేతుకంబుగ నిట్టికోపమేల? ఇత్తఱి నారాజుపై దండెత్తినచో నన్యాయయుద్ధంబని జనులు మనలను నిందింతురు గాన.

క. కారణములేక కార్యము
గా రా దనిపెద్దలండ్రు గావునరంధ్రం
బారసి రాజోత్తమ! ప్రతి
కారం బేమైనఁగాని కావింప నగున్.

రాజు—కారణములేదా? నీకుఁ దెలియలేదు గాఁబోలును.

ఉ. ఇప్పుడువాఁడు సేయుపని యేమొయెఱుంగవె? యింకనేమి వా
తప్పులు సేయఁగావలెనొ? తద్దయుఁబాటెడు కొండకాల్వలం
జప్పున నడ్డుగట్టి పలుసస్యము పండఁగ నాత్మరాజ్యమున్
జొప్పడఁజేసెఁ దానెదురఁజూడవె? న్యాయముఁదప్పె నీసునన్.

నీవిట్టివెడఁగుమాటలాడకుము. ఉత్తమమైన క్షత్రియ వంశంబునఁ బుట్టి క్షాత్ర

మింగనైనను లేక యిట్టిపిరికిమాట లాడ నేమిమగతనంబు? ఎట్లైన నారాజుం జయించి వీరలక్ష్మిం జేకొందుంగాక.

మత్తకోకిల. వీరవంశమునందుఁ బుట్టియు వీరులన్ రిపులన్ సుగం
భీరులం బొలియింప లేనిది విశ్రుతంబగు క్షాత్రమే?
శూరుని స్థిరమందు నేర్చి విశుద్ధకీర్తిని బొందెదన్
గారుబీరము లాడుచుండుట గాదుసుమ్ము యథార్థముల్.

మంత్రి——(స్వగతము) అంతకంతకుఁ గ్రోధంబు హెచ్చి యెదిరిబలంబెఱుఁగనివాఁడై యిట్లనుచున్నాఁడు. నేనిప్పుడేమన్నను వినువాఁడుగా లేఁడు. పోనిమ్ము నాకేల? ఎవఁడెంతచేసికొను నంత ననుభవించునుగదా? (ప్రకాశముగా) రాజేంద్రా! మీరట్టి పౌరుషవంతులే.

రాజు——పౌరుషముకంటె జీవనము పెద్దయే? పౌరుషహీనుఁడై బ్రతుకుకంటె సమరంబున నరాతివీరులచే మడియుట మేలు. ఈజన్మం బనపాయంబు గాదు గదా? నవలక్షకళింగాధిపతినై యుండియును వేయిమడుంగులు తక్కువగు బొబ్బిలిరాజుల పాటి యశంబును బొందలేక కీర్తికాంతను జేసేత వారిపాలెట్లుసేతును?

మహాస్రగ్ధర. ఘోరంబౌ మత్ప్రకాండాగ్నుల వెలమకులాంకూరముల్ కాల్చివైతున్
వీరాటోపం బెలర్ప న్విమతుల సమరోర్వీస్థలి నైండివైతున్
శౌరంభానీకఘాటిం బ్రకటిత విజయం బంది బొబ్బిల్లడీనిన్
ధీరాద్ధత్యంబుపేర్మిన్ స్థిరముగ నిజదోర్దీప్తశక్తిన్ భరింతున్.

అట్లుగాదేని.

గీ. రంగరాయఁడొండె రంగద్విజయరామ
రాయఁడొండెనుభయరాజ్యములకు
రిపులనోర్చియేలు విపులభీమాహవ
కేళియందు నిజజనాళి మెచ్చ.

అట్లుగాన మంత్రివరా! నాయుద్యమంబునకుఁ దగిన ప్రయత్నంబొనఁ గూర్పుము. అరాతివీరులబల మేనెఱుంగనిదిగాదు. వారును శౌర్యాన్వితులే, అట్టివారిని దురంబున జయించినదే జయము. పిచ్చుకమీఁదఁ జంద్రాయుధ మన్నట్లు గంభీరులకుదాగి భీరులైనవారిపై దాడివిడియు చేటినడువడి?

మంత్రి——అది నిజమేగాని

గీ. జన్యములకేగు కాలంబు చక్క నెఱిఁగి
పగఱబల మెంచి సప్తాంగపటిమ నెఱసి
పగను సాధింప సంకింప వలెను గాని
తలఁచినప్పుడ సమకట్టఁ దగవుగాదు.

రాజు—పోనిమ్ము. మనకపకారమొనరించిరా లేదా ?

మంత్రి—దానివలన గోపాలకృష్ణరంగారావు మనకు నికారమెంచెనో లేదో ?

రాజు—నీవింక నట్లనియెదవేల ?

గీ. నిర్భరము లడ్డి మనచేల నీరుబాఱ
నీక మనరైతు లంతట నాఁకపెట్ట
మన్నెవా రంత వారల మట్టిరి యఁట
దగునె వారికి ? నింతయుఁ దలఁప వైరి.

ఇందుకేమనియెదు ?

మంత్రి—రాజా ! అదియకార్యమే. మొదట సామదానభేదంబుల వారితో ముచ్చటించుటమంచిది.

రాజు—మొదటినుండియు నాయందసూయాభావమునే మదిఁ బొందుపఱచియున్న రంగరావు నాతో రాచకార్యసరళి పొత్తొనరించునా ? నీవు చెప్పినది యొప్పుగనున్నది. ఏమినీతిచెప్పితివి ? ఆరాజాధముండు నన్నంత నీచపఱచెనుగా ? వానితో నాసామదానభేదోపాయంబులు ?

మంత్రి—గీ. ఎట్టి కార్యములందైన నేలిక ! మును
మున్న ప్రతికార్యమునకును బూనుపట్ల
సామదానభేదంబులఁ జక్కఁజేయఁ
గాకయుండినఁ దండంబె కడఁక దగును.

రాజు—కం. ఆలోచనలెన్నియునిం
కేలా యీయెడల మనకు ? నింతేనియులోఁ
జాలిఁదలఁపఁదగదు తగవు
మాలినయావెలమదరభి మానులయెడలన్.

గనుక మంత్రివర్యా ! పరిపరివిధంబులఁ దద్విధానంబు మనంబున నాలోచించుచుం
[illegible] నాపక్షీయత్వంబునకే కడఁగుము.

(నేపథ్యంబున) కళింగాధిపుఁడెచ్చటనున్నవాఁడు ?

(అందఱు నాలకించుచున్నారు,)

సేవకు—మహాప్రభూ ! ఎవ్వరోయిద్దఱు తురకబంట్రోతులువచ్చి రాజుంజూపుమనిఘీ మాట్టహాసముచేయుచున్నారు సెలవైనఁదోడ్కొనివత్తును.

రాజు—మంత్రివర్యా ! వారి నిటు బిల్వ నంపుము.

మంత్రి—చిత్తము. రాజేంద్రా ! సేవకా !

సేవకు—మహాప్రసాదము మంత్రిపుంగవా !

మంత్రి—వారినిటుదోడ్కొనిరమ్ము.

సేవకు—చిత్తమట్లే తోకొనివత్తును.

(అనిపోయివారిని వెంటఁగొనివచ్చుచున్నాఁడు.)

బంట్రోతు—సలామ్ దేఖో మహారాజ్ మాప్రభువైన హైదరుజంగు తమకిమ్మని తాఖీదొసంగియున్నాఁడు. ఇదిగో గైకొనుఁడు.

(అని మంత్రికా తాఖీదునిచ్చుచున్నారు.)

మంత్రి—(చదివిచూచుకొని) రాజేంద్రా ! హైదర్జంగుసాహెబుగారు మనలను దస్తువసూలుచేసికొని జమాబందీ నిమిత్తము రాజమహేంద్రవరముమకాముకు రమ్మని కమ్మవ్రాసిరి. ఇదెవర్తమానము.

రాజు—అట్లయిననరే. (ముఖవిలాసముతో) మంత్రివరా ! ఇట్టియధికారమును వీరికెవ్వరొసంగియున్నారు మఱచిపోతిని జెప్పుము ?

మంత్రి—రాజా ! ఉత్తరసర్కార్లను 1752 వ వత్సరంబున డక్కనునవాబగు సాలబజ్జంగుగారు పరాసుసైన్యరక్షణకొఱకు బుస్సీదొరవారికొసంగియున్నారు. వెనుక ముజఫర్జంగుగారు డూప్లేదొరవారికిచ్చిన దేశముతో నుత్తరమున గుండలాకమాలగాయతు జగన్నాథమువఱకు నుండు దేశమంతయుఁ బరాసువారిస్వాధీనమైనది. గనుక బుస్సీదొరవారుమనకు సర్వాధికారులు. హైదర్ జంగుసాహెబుగారు వారిమంత్రులు.

రాజు—అపును జ్ఞాపకమువచ్చినది (వికాసము ముఖమునందోఁపఁగా.)

(స్వాగతము) మంచిసమయము సమకూడినది కానిమ్ము వారింగలిసి యభిమతసిద్ధింబడసెదనుగాక (ప్రకాశముగా) మంత్రివరా ! వారెప్పుడువచ్చిరి ?

మంత్రి—క్రీస్తుశకమునందు 1756 వదియగు సీవత్సరము డిశంబరునెల 19 వ తేదీని వా

రు రాజమహేంద్రవరముం బ్రవేశించియున్నారు.

రాజు—బంట్రోతులారా! ఎవ్వరెవ్వరువచ్చిరి?

బంట్రో—మహారాజా! సర్వసర్వంసహాధీశ్వరుండగు బుస్సీదొరవారు వారి మంత్రియగు హైదర్జంగు సాహేబుగారు మహమ్మదుహుస్సేన్ లాడూఖాన్ సిద్దీబిలాల్ జానూఖాన్ హసనల్లీఖాన్ మొదలగు మేటిజోదులును వచ్చియున్నారు ఇంక నాగోజీరాయాది ముసద్దీలు చాలామందిసిద్దీలును వచ్చియున్నారు.

రాజు—వీరికందఱకు బసదిగుటకుఁదగిన స్థలంబెచ్చటననుపడినదో?

బంట్రో—గోదావరీ తటంబునఁ గోటిలింగపుణ్యక్షేత్ర సామీప్యంబున గుడారంబుల నిర్మించుకొని విడిసియున్నారు మహాప్రభూ!

రాజు—వారు సేనాసహితంబుగవచ్చినారా?

బంట్రో—మహారాజా! వారుచతురంగ బలసమేతంబుగవచ్చియున్నారు?

రాజు—ఏయే రాజులకుఁ దాఖీదులనంపియున్నారు

బంట్రో—శ్రీకాకుళపుసర్కారులోఁగల జమీదారులకందఱికిని దాఖీదులంజేసియున్నారు మేముసత్వరంబుగఁబోయి వారికీతాఖీదులంజూపి బూసీసందర్శనంబునకుంబోవలసియున్నది మాకు సెలవొసంగుఁడు.

రాజు—మంత్రివరా! ఈసాహేబులకుందగిన సత్కారంబులఁజేసిపంపుము మనమును బుస్సీదర్శనమునకు వేగమ పోవుదము.

మంత్రి—మంచిదిరాజేంద్రా! అట్లేయొనర్తును.

(అనివారికిఁదగిన బహుమతులనొసఁగి పంపివేయుచున్నాఁడు.)

రాజు—సచివాగ్రణీ! మనప్రయాణంబునకుఁదగిన రథగజపదాతి తురంగవ్రజంబు నాయత్తపఱుపుము సేనలకుఁ బ్రయాణంబులుసెప్పి తగినయుద్యమంబున నుండుము. మఱియును దగిన దినంబారసిచెప్పుము.

మంత్రి—నరేంద్రా! వార్షికవాసరంబులరిగె శరత్కాలంబు జరుగుచుండె విజయనిమిత్తోత్సవంబులనలరుచు రాజన్యులకు జన్యముల కరుగు కాలముఁగూడ సమకూడినది..

గీ. కొలఁకులెల్లను సంపూర్ణ జలముచేత
నొప్పుచున్నవి. తృణవృద్ధిసర్వ్రియొనఁగు
చున్న దిప్పుడురాజేంద్ర! యొయ్య సేన
లకు గజాళికి నసుఖముల్లురుగ వధిప!

కావున నేలిక శుభప్రయాణంబున కెల్లియ భవ్యదినము.

రాజు—మంచిది. మంత్రివరా! దుర్గరక్షణంబునకు నేరినైన నియమించితివా?

మంత్రి—నియమించితిని రాజేంద్రా! సమస్తంబునాయత్తపఱచితిని.

రాజు—అట్లైన సరే. రేప పయనమైపోవుదము.

(అని అందఱు నిష్క్రమించుచున్నారు.)

రంగము :—రాజమహేంద్రవరములో హైదర్జంగు కచ్చేరీ.

(బంట్రోతులు ప్రవేశించుచున్నారు)

బంట్రోతులు—సలామ్, హైదర్‌జంగు మంత్రివరా! తాఖీదులను దమ సెలవు ప్రకారము శ్రీకాకుళము సర్కారులోఁగల జమీదార్లకిచ్చివచ్చినాము.

హైదర్—మంచిది పొండు.

సభ్యులారా! పారావారంబు ఘూర్ణిల్లెడు తెఱంగుననుకరించుచు ధ్వని వినవచ్చెడిని. నాగోజీరాయప్రముఖులారా! మనపై సంగ్రామం బొనర్చుట కేరైన వచ్చుచున్నారేమో? (భటులతో)

క. కాండంబునిండి భేరీ
డాంఢధ్వానంబు దిక్తటంబు లవియ ను
ద్దండత విన వచ్చెడి నరి
దండెత్తుటయేమొ? తెలియఁ దగు భటులారా!

నాగోజీరావుగారూ! అదేమొ మీరేగి చూచిరండు.

నాగోజీ—చిత్తము. మంత్రివర్యా. ఇదే పోవుచున్నాను.

(నాగోజీరావు పోవుచున్నాఁడు)

హైదర్—సిద్దిబిలాల్?

సిద్దిబిలా—జీ! సాహెబ్, మెహర్బాన్, సలామ్.

హైదర్—మీరందఱు మీమీ సేనలతో సిద్ధముగానున్నారా?

సిద్దిబిలా—తయార్ మహరాజ్.

హైదర్—మంచిది. (నాగోజీ ప్రవేశించుచున్నాఁడు)

నాగోజీ—గీ. చూచి వచ్చితి నరిసేనచూడరాదు
మిమ్ముదర్శించునుత్కంఠ మీఱినృపులు
పటురయంబున వారిటువచ్చుచున్న

వారలేగాని మఱి యొండ్లుగారుసుమ్మీ.

శా. సాహేబాగ్రణి ! బూసిదర్శన సముత్సాహాగతక్షోణిభృ
ద్వ్యూహోదగ్రపటుప్రతాప విశద వ్యాధాయమాన స్ఫుట
వ్యూహావిర్భవగర్జితారవలసద్వ్యత్క్రీడ్యమానాంక్యథ
క్కాహీనానక భీమవాద్య ఘననిహ్రాదం బదే మ్రోగెడిన్.

హైదర్—మంచిది. చమూపతులారా ! మీస్థానంబుల కరుగుఁడు.

సిద్ది—చిత్తము సలామ్. (అని పోవుచున్నారు)

హైదర్—రాజులన్న జ్ఞాపకము వచ్చుచున్నది. మనము తాఖీదులం బంపి నేటికి వారము రోజులైనదే. నేటిదినము 28 వ తారీఖు కూడఁ బ్రవేశించె. ఇంకను రాజులు రాలేదా ?

నాగోజీ—క. వచ్చిరికొందఱు రాజులు
వచ్చుచునున్నారు మిగులువారలు దూరం
బిచ్చటికి వారినెలవులు
క్రచ్చరరాఁజాలమి కిదె కారణమేమో ?

హైదర్—వారిని నీవు చూచినావా ?

నాగోజీ—చూచితిని మంత్రివరా !

హైదర్—వారందఱుఁ గచ్చేరీకి వచ్చిరా ?

నాగోజీ—రాలేదు.

హైదర్—వారి నింకెట్లు తెలిసికొంటివి ?

నాగోజీ—క. రాజులనందఱఁజూచితిఁ
దేజోవైభవములెంతొ దీపింపఁబురీ
రాజపథంబున రా నే
రాజద్గతిమీఱి వారిఁ బ్రజలు నుతింపన్.

క. చతురంగబలసమన్వితు
లతులితవైభవ తిరస్కృతాఖండలు ల
ప్రతిహతబలబలభద్రులు
క్షితిపతు లాకొక్కరె వచ్చి చేరిరి నగరిన్.

హైదర్—ఆలాగా ?

క. నీవట్లు చెప్ప నాకున్
భావంబున వేడుకయ్యెఁ బల్కుము వినఁగా
నా విభుల విశేషమ్ముల
నీ వెఱిఁగిన కొలఁది వారి నెల్లెఱిఁగితివో!

నాగోజీ—అట్లైన వినుము. మొదటఁ గళింగాధిపుఁడగు విజయరామరాజు నిజబాహుశుండాదండవిరాజిత విజయగాండీవ సన్నిభ కోదండుండై యిరువంకల శంఖారావములు దేవదత్తారవ సన్నిభంబులుగాఁగ, నైరావత తిరస్కృత గజంబులు, నుచ్చైశ్శ్రవసన్నిభంబులగు వాజిరాజులును, నిరుపమానసంగ్రామ కళాధౌరేయులంబోని సైనిక నికాయంబులును, బలిసి రాఁ దద్ధ్వని మిన్నుముట్టి మాఱుమ్రోయ నొక్కపెల్లున నీ రాజమహేంద్రవరపురంబుఁ బ్రవేశించె. అదే కదా యాధ్వని మీరు మమ్ముఁ దెలిసికొని రమ్మంటిరి?

హైదర్—మఱే అదే నా యాధ్వని. అట్టివారేమి వారు?

నాగోజీ—సుగంధివృత్తము. ఆకళింగభూమిజాని యద్భుతంపు వైభవం
బేకడిందిఁ జెప్ప నేర్తు నేను మీకు ధీనిధీ!
యాకుభృద్భిడౌజమూర్తి యాత్మవర్గయుక్తుఁడై
వీఁకమీఱ దర్శనంబు వేడ్కమీఱ వచ్చెడిన్.

హైదరు—ఇంక నెవ్వరు వచ్చిరి?

నాగో—మహాప్రభూ! కాకర్లపూడివంశాంబుధి సోముఁడగు జగన్నాథరాయవరుండును సత్యవరపుర స్వామియగు రామభద్రరాజాగ్రణియును గాశీపతి క్షమాధవుండును జింతలపాటి నీలాద్రిరాయండును మఱికొందఱు నా విజయరామరాజుమ్రోలనే వచ్చిరి.

కం. ఆ రాజవరాళిఁ జూడఁగ
గౌరవమున మండపాటికలితకులజులౌ
శ్రీరఘునాథాగ్రణియును
వీరుఁడు బలభద్రరాజు విచ్చేసి రొగిన్.

హైదరు—కళింగదేశాధీశ్వరుండబ్బా యింతటివాఁడేమి? ఎందఱినో తురుష్కావనీపతుల నతులగతి న్నిలకించుచుంటినిగాని వీరిం బోలినవారి నెందేనిఁ జూచి యుండలేదు. అందుచేతనే గదా శ్రీకాకుళపు నాయబగు జాఫరల్లీఖాను పఠాసుల నెదిరింపఁ

గోరి యీరాజును సహాయము చేసికొనె?

(బుస్సీ ప్రవేశించుచున్నాఁడు.)

(అందఱు లేచి సలాములఁ జేయుచున్నారు. వారియాజ్ఞనొంది యందఱు నాసీనుల గుచున్నారు.)

బుస్సీ—(శ్రవణమభినయించి) హైదరుజంగుగారూ! ఆధ్వనియేమి?

హైదరు.—నాగోజీరావుగారూ! ఆధ్వనికేమికారణము? చూచిరమ్ము.

నాగోజీ—(తొంగిచూచి) మహాప్రభూ! బుస్సీవర్యా!

చం. నలువదివేలకాల్బలము నాలుగువేలహయంబులెన్నొయే
    న్గులును శతఘ్నికాచయముఁ గూడి ప్రభుత్వమహత్త్వఁదెల్పఁగా
    నలరుచు రాణ్మహేంద్రవరుఁ డాదట మాగధవార మెంతయుం
    గొలుచుచుఁగూడరాఁగ నిదిగో చనుదెంచె డిమిమ్ముఁజూడఁగన్.

(విజయరామరాజు ప్రవేశించుచున్నాఁడు.)

విజయ—బుస్సీగారు! సలామ్. హైదర్‌గారూ! సలామ్.

హైదరు—(లేచి) సలామ్ రాజా! దయసేయుము.

(అని కుర్చీని జూపుచున్నాఁడు.)

రాజు—ఆసీనుఁడగుచున్నాఁడు.

హైదరు—రాజేంద్రా! నేమంబె?

విజయ—మీయనుగ్రహమువలన క్షేమము. మంత్రివర్యా!

గీ. మీదుతాఖీదుఁజూడఁగ నాదుడెంద
    మధిక మానందమును బొంది యలఘు గతిని
    మిమ్ము దర్శించువేడుక మించఁగా ని
    చటికి వచ్చితిమయ్య యోసాహెబేంద్ర.

హైదరు—మంచిది రాజాగ్రణి! మీదర్శనంబుచే మాకును సంతసమయ్యె. మీపరిపాలనావిశేషమ్మున జనుల కధికసుఖం బగుచున్నదిగదా! అమాత్యభృత్యవర్గంబు మీయిష్టానుసారంబు ప్రవర్తిల్లునే?

విజయ—మ. అరిదిం జూపరులు న్ఘనంగఁ బ్రజ లత్యంతంబు నాయాజ్ఞల
    న్నొరది న్వే శిరసావహింతురి సచివుల్ చోద్యంబుగా మద్వచ
    స్సరణి న్జేయుదు రెల్లకార్యముల నశ్రాంతంబు భద్రంబు మీ

యురుకారుణ్యముగల్గుట వ్యసలిమానుర్వీపతి గ్రామణీ.

హైదరు—రాజేంద్రా! మిగుల సంతసంబయ్యె. (తెఱలోఁగలకలము)

నాగోజీ రావుగారూ! ఆకలకలంబేమి?

నాగోజీ—(తొంగిచూచి) మహాప్రభూ! మీసందర్శనంబునకుఁ దక్షిణ శ్రీకాకుళపు మహీపతులరుఁగుదెంచుచున్నారు.

హైదరు—సేవకా! కుర్చీలు వేయుము.

సేవకు—చిత్తముస్వామీ! (అని యట్లొనర్చుచున్నాఁడు)

హాయి—సేవకా! హుక్కాయి నిటుతెమ్ము.

సేవకు—తెచ్చి యిచ్చుచున్నాఁడు.

హాయి—పీల్చుచు వింతహాయి ననుభవించుచున్నాఁడు.

రాజులు ప్రవేశించుచున్నారు.

రాజులు—సలామ్ బుస్సీవర్యా! హాయిదరుజంగుగారూ! సలామ్.

విజయరామరాజుగారు తాజీమిచ్చుచున్నారు.

నాగోజీ—ఇటుకూర్చుండుఁడు రాజవర్యులారా!

(అని వారల నాసీనులం జేయుచున్నాఁడు)

హాయి—అబ్బా ఖైనాగోజీ! వచ్చినవారెవరు? (అని కనుసైఁగ చేయుచున్నాఁడు.)

నాగోజీ—గీ. సాహెబాగ్రణివిను మీ రసావరుండు
వత్సవాయాన్వవాయుండు బాయకేశ్వ
రానుజుల్వీరు వీరునారాయణేశ
కిమిడిరాజన్య పుంగవు లమితయశులు.

గీ, వీరుగొలుగొండ భూజాను లారయంగ
సత్త్వవరరాజచంద్రుఁడీ సత్త్వఘనుఁడు
నీలభూధరరాయఁడీ నిర్మలుండు
కాశిపత్యభిధేయుఁడీఘనయశుండు.

వీరు కాకర్లపూడి జగన్నాథరాయవరులు వీరు మందపాటివంశాంబుధి సోములగు రఘునాథ బలభద్రరాజ పుంగవులు.

బుస్సీ—క్షమావరులారా!

క. మాయానఁ బూనిమీరిట

కైదేతెంచుటకు మోదమందితి మింకన్
జేయుఁడు విహితోద్యమముల
నాయతభుజులార! మీరలాయత్తపడన్.

విజయ—చిత్తము. ఫరాసువంశాగ్రణీ!

బుస్సీ—హైదరుజంగుగారూ! వీరితోఁ మనకుగల పనినంతయు జూటపఱచి వీరికి సెలవులనొసంగుఁడు.

హైదర్—మహాప్రసాదము స్వామీ!

బుస్సీ—భోజన సమయమైనది పోవుదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

రంగము:—విజయరామరాజుబస.

రాజు మంత్రి నౌకరు మొదలగువారు ప్రవేశించుచున్నారు.

రాజు—మంత్రివరా! మనగ్రామముల విషయమైన సముజాయిషీ దివాణమువారికిఁ దెల్పుటకు మనకు వకీలు ముఖ్యంబుగదా!

మంత్రి—అవును రాజేంద్రా పిలిపించెదను. సేవకా! యిటురమ్ము.

సేవకు—చిత్తము స్వామీ! ఏమి సెలవు?

మంత్రి—నీవుపోయి యొకవకీలును బిలుచుకొనిరమ్ము.

సేవకు—మహాప్రసాదము స్వామీ.

(అనిపోయి వెంటఁగొని వచ్చుచున్నాఁడు.)

(వకీలు ప్రవేశించుచున్నాఁడు.)

వకీలు—నమస్కారము రాజేంద్రా! నమస్కారము మంత్రివర్యా!

మంత్రి—వకీలుగారూ! ఇటఁ గూర్చుండుఁడు. (కుర్చీని జూపుచున్నాఁడు)

వకీలు—ఆసీనుఁడగుచున్నాఁడు.

మంత్రి—మీరు మాకొక రాచకార్యము చేసిపెట్టవలె.

వకీలు—అట్లనే. మంత్రిగారూ దానికేమి? సెలవిండు.

మంత్రి—క. మీరాతురుష్కవర్యు హ
జారమునంజేరి వచన చాతురిమెఱయన్
మారాచ కార్యము నవి
స్తారంబునుదెల్పి సెలవు దగఁగొనిరండీ.

వకీలు—చిత్తము స్వామీ! అట్లే చేసెదను.

మంత్రి—"ఎప్పటికిని మాకళింగకు మోతాదుగ జమాబంది ద్వాదశలక్షల కేర్పాటున్న ది. ఆసొమ్ములో సగమిపుడును దక్కినసగము మీరు గోదావరిఁ దిరిగి దాటులోగ నియ్యఁగలవార" మని చెప్పుము.

వకీలు—అట్లే మనవిచేసెదను. పోయివచ్చెదను.

రాజు—వకీలుగారూ! ఒకమాట హైదరుజంగు సాహేబుగారితో నామాటగా నిట్లు మనవిఁజేయుఁడు.

క మీతోఁగొంతఁ బ్రసంగముఁ
బ్రీతిన్సలుపంగ నాకు వేడ్కయ్యెడిసేఁ
బ్రాతఃకాలమ వచ్చెదఁ
జేతున్మీయిష్టమట్లు చెన్నలరారన్.

వేగఁ దిరుగ జవాబులఁ గొనిరమ్ము.

వకీలు—చిత్తము. పోయివచ్చెదను రాజేంద్రా!

రాజు—(స్వాగతము) నామనోగతంబగు నాలోచన నీమంత్రితోఁ జెప్పితినా వల దు డుగుమనునేమో? హైదరుజంగు తనతో రహస్యమున ముచ్చటించుటకు సమయ మొసంగకపోవునా? ఏలాగునసైన నీహైదరుజంగుం దోడ్కొనిపోయి యాబొబ్బి లి గడీపైదింపవలె (ప్రకాశముగా) మంత్రివరా! హైదరుజంగు మిగుల మంచివాఁ డుగాఁ గన్పట్టుచున్నాఁడు. అన్నిసంగతులు మన యిష్టమట్లే యొనర్చునుగా!

మంత్రి—మంచివాఁడుగనే చూపట్టెడిని రాజా!

రాజు—మనకిచ్చట నింకనెన్నిరోజులు పనియున్నది.

మంత్రి—మనవకీలు పనినంతయును సానుకూలపఱచుకొని వచ్చిన మనకింక నేమిపని యున్నది.

రాజు—మనముచెప్పినట్లు వాఁడీకొనునో లేదో?

మంత్రి—ఇయ్యకొనవచ్చును.

రాజు—క. జాగయ్యె మనవకీలట
వేగి మరలిరాఁడు మంత్రి! యేమిది? కార్యం
బేగతి సభలో నెఱపెడి
నోగద! దప్పింత గలుగకుండ మనయెడన్.

మంత్రి—అటుచూచి మహాప్రభూ! వచ్చుచున్నాఁడు.

రాజు—ముఖము తేటగనేయున్నది. కార్యము సానుకూలపఱచుకొనియే వచ్చుచున్నట్లు గన్పట్టెడు (వకీలు ప్రవేశించుచున్నాఁడు)

వకీలుగారూ! ఇట్లు దయసేయుఁడు (కుర్చీనిచ్చుచున్నాఁడు)

వకీలు—కూర్చుండి సేదదీర్చుకొనుచున్నాఁడు.

మంత్రి—మేఖవిలసితవృత్తము. రాజేంద్రా! చతురతమెయి యవనో

ర్వీజానిన్గని విశదపఱచి స

త్తేజస్స్ఫూర్తిని దెగువమనవకీ

ల్రాజన్రూఢిని రయముగవచ్చెన్.

రాజు—అపుడు నీవుచెప్పినది నిజమె. వకీలుగారూ! ఏమిసమాచారము?

వకీలు—రాజాగ్రణీ! దేవగణ పరివేష్టితుండగు దేవేంద్రునిపగిది నిఖిలరాజన్య పండిత లేఖక భృత్యనివహంబులో నక్షత్రమధ్యంబుననున్న నిశాకరుండువోలెఁ గూర్చుండి యున్న హైదరుజంగుంగాంచితిని.

రాజు—తరువాత.

వకీలు—క. నేవేగఁజని కళింగ

క్ష్మావిభుని వకీలుననఁగ సన్మానంబు

న్గావించి సేమమారసి

మీవచ్చిన కతముఁదెల్పుమీ మాకనియెన్.

రాజు—తగినమర్యాద సల్పినాఁడుగా! తరువాత.

వకీలు—ముందుగఁ గళింగసర్కారులోఁగల జమాబందీ విషయమైన సంగతులు తర్వాతఁ దక్కిన రాజకీయపద్ధతుల గుఱించియు వారడిగినవానికిఁ దగునుత్తరంబుల ముచ్చటించితిని.

రాజు—తరువాత.

వకీలు—క. ద్వాదశలక్షల రూప్యము

లేదగ నెపుడిచ్చుచున్న ఇందుసగంబి

ప్డీఁదలఁచితిమిఁకఁ గొదువను

గోదావరి మరలదాటకుండఁగమీకున్.

ఇట్లంటిని

రాజు—హాయిదరేమనె.

వకీలు—వల్లెయనె. తారు శ్రీకాకుళము వచ్చుచున్నారుగాన నచ్చట నియ్యవచ్చుననిరి.

రాజు—సరే! ఇంతమట్టుకు బాగుగనేయున్నది. మంత్రివర్యా! వారచ్చటికివచ్చి మఱలి పోవునంతలో మనము సొమ్ము నియ్యలేమా?

మంత్రి—ఇవ్వవచ్చును స్వామీ!

రాజు—తరువాత నాసంగతి యేమైనది.

వకీలు—తోదకవృత్తం. సలలితమాగతి సాహెబుతోడ
న్బలికితినే మృదుభాషల నాతోఁ
దెలిపినవార్తలఁ దెల్లముగావాఁ
డలరిసరేయని యానతినిచ్చెన్.

రాజు—గీ. నీవెబో వకీలన్నను నిముషయుక్త
మందుఁగార్యంబువారితోఁ బొందుపఱచి
వచ్చితివి నీదుచతురత మెచ్చవచ్చె
డిని నిశాంతంబునందెల్లి పనివినియెద?

నీవలనఁ గావలసిన కార్యమున్నది. హాయిదరుజంగుతో నేను మాట్లాడునప్పుడు నీస హాయము నాకుఁ గావలె నొక్కతూరి తప్పకరమ్ము.

వకీలు—అట్లే వచ్చెదను స్వామి! ప్రస్తుతము సెలవుఁగైకొనియెదను.

రాజు—పోయిరమ్ము. (వకీలరుగుచున్నాఁడు).

(అందఱును నిష్క్రమించుచున్నారు)

రంగము:—హాయిదరుజంగు కచ్చేరీ,

విజయరామరాజు వకీలు మొదలగువారు ప్రవేశించుచున్నారు.

విజయ—సలామ్ సాహేబుగారూ!

హాయి—సలామ్ రండు కూర్చుండుఁడు. (కుర్చీలఁజూపుచున్నాఁడు)

విజయ—ఆసీనుఁడగుచున్నాఁడు. (వకీలునుఁ గూర్చుండుచున్నాఁడు)

హాయి—రాజేంద్రా! ఏమివిశేషములు?

రాజు—మీదర్శనముకంటె విశేషతరమైనవెవ్వి?

హాయి—గీ. మీవిషయ పరిపాలనా కోవిదత్వ
మంత నిర్విశేషంబుగా నాలకించి

మీవిషయమై నుడివె బుస్సి మెచ్చుకొనుచు
మీ వకీలంతయుం జెప్ప భూవరేణ్యా.

రాజు—నాయందుఁ బరిపూర్ణానుగ్రహ ముంచుటఁబట్టి మాకుక్షేమమారయుచుందురు.

హాయిదరు—నిన్నటిరోజున మీరు వర్తమానమంపి యుంటిరే?

రాజు—సాహేబుగారూ ! అవును.

క. పనులెల్ల ముగిసెఁ దగమీ
పనుపున యవనావతంస! పదఁపడి పో మీ
యనుమతివడయుటకంటె నిఁ
కనుపమసత్కీర్తిధుర్య! యధికం బున్నే?

హాయి—రాజులందఱుఁగలసి పోయెదరా యేమి?

రాజు—క. ఈరాజమౌళులందఱు
నోరాజితకీర్తిధామ! యురుదూరమునా
తో రా రందందుఁబ్రయా
ణారంభమునందు మధ్య నాగెదరుసుమా.

క. అంతంబువఱకు వచ్చిన
నంతాకాంతుండు రాఁ డనంతయశోవి
క్రాంతా! యింతదనుక మీ
యంతికమున కదియుమీకునవగతమె కదా?

హాయి—వారెవరు?

రాజు—వారా? బొబ్బిలిరాజుగారు.

హాయి—ఎట్లెట్లూ! రాలేదుగా! ఏమీ? ఎందుకురాలేదు? సేవకా! నాగోజీరావు గారిని బిలుచుకొనిరమ్ము.

సేవ—చిత్తము స్వామీ. (అనిపోయి తోడుకొని వచ్చుచున్నాఁడు)

నాగో—సలామ్ సాహేబుగారూ!

హాయి—అందఱురాజులు జమాబందీకరుగుదెంచిరా?

నాగోజీ—బొబ్బిలివారుతప్పఁ దక్కినవారందఱు వచ్చియున్నారు. వారితోఁగలపని సర్వము పూర్తియైనది.

హాయి—బొబ్బిలివారు రాలేదనిదేమేల మాతో చెప్పలేదు?

నాగో—ఇఁకవత్తురేమో ?

క. ఇప్పుడెవచ్చునొ లేకిం
కప్పుడె వచ్చునొ యటంచు నాత్మఁ దలఁచి నే
జెప్పకయుంటిని మీతోఁ
దప్పని మదిఁ దలఁప కుండఁ దగఁ బ్రార్థింతున్.

హుయి—వారికి మాతాఖీదు పంపితివా ?

నాగో—పంపియున్నాను మంత్రివరా !

హుయి—మంచిది పొమ్ము. (నాగోజీరావు పోవుచున్నాఁడు)

విజ—సాహేబుగారూ ! ఎందుచేతరాలేదో నేనెఱుఁగుదును.

హుయి—కారణమేమొ జెప్పుఁడు.

రాజు—శ్రీకాకుళపు సర్కారులోఁగల జమీదారులలో బొబ్బిలివారుతప్పఁ దక్కినవా రందఱు సీదస్తులోనికి వచ్చియున్నారు. వారుమాత్రము రాలేదు. వారు రారు.

హుయి—ఏమి కారణము ?

రాజు—(తనలో) నాకిదేసమయము. బొబ్బిలిరాజు దివాణంబువారికంటె నెక్కుడు వాఁడని చెప్పినంగాని యీతురుష్కాగ్రణికి నుగ్రమైన కిన్క పుట్టదు. వైరిరాజు నెక్కుడుగఁజెప్పుట నాకుందగిన పని కాదు. అయినన్నట్లు జెప్పినంగాని నామంత్రం బు ఫలింపదు. కాని మేలైన సరే. (ప్రకాశముగా) సాహేబుగారూ ! పద్మనా యకశిఖామణియగు రావుకులాగ్రణి దుర్నిగ్రహచండదోర్దండ ప్రతాపప్రభూతగర్వా విలచేతస్కుండుగాన దివాణంబువారిని సరకుఁగొనఁడు. వాఁడెంత ధన్యుఁడో కా ని యెంతటిఖాన్నినూలకుం జడియండు.

హుయి—గీ. సరకుఁజేయఁడె ? కానిమ్ము తురకదెబ్బ
చవిఁగొనుంగాక భూరిప్రచండకాండ
దోఃప్రభావాగ్నికీలల దొమ్మి గాఁగఁ
బడి సమయునప్పుడే మత్ప్రభావ మెఱుఁగు.

రాజు—ఇంతేగాక శిస్తువడవనీయఁడు. దస్తుఁగానియ్యఁడు. నిజమాడిన నిష్ఠురము. ఎం దుకు ?

హుయి—ఏమేమీ ? ఇంకనెటువంటివాఁడు ? ఇట్టిగర్వమునకుఁ గారణమేమి ?

రాజు—సాహేబుగారూ ! ఆరాజు బహుపరాక్రమశాలి. అదేకారణము.

హాయి — అంతపరాక్రమశాలియేమి ?

రాజు — శా. రంగారాయ వరాపరార్జునుఁడు దోఃప్రావీణ్యమేపారి తా
రంగత్తుంగదురాపగాండివనిభోగ్రాగ్నిలకోదండ మా
భంగప్రౌఢిమఁ దాల్చి ఘోరరణభూభాగంబున న్నిల్వఁగా
గంగానందనుఁడైనఁ గావుమనుచుం గైచాపు లర్పింపఁడే ?

ఇంతేగాక పాండవేయుల భుజాబలంబును గార్తికేయుని పరాక్రమంబును విబుధాపగాసూనునిమహిమయు మహేశ్వరునిమాహాత్మ్యమును విక్రమార్కుని వీర్యాతిరేకంబును బరశురాముని పౌరుషంబును సంగ్రహించి విరించి మించి యీబొబ్బిలివెలమదొరల నిర్మించెనని తోఁచుచున్నది.

మత్తకోకిల. రంగదున్నిజఖడ్గరాహువు రాజమండలి మ్రింగ న
త్తుంగశౌర్యవిభావసుం డలదోర్బలాంధతమంబులం
భంగపెట్టఁ దదాజ్ఞకూలము పొంజునంద్రము నష్టఁగా
సంగరంబున రంగరాయని సైఁచువా రెవ రుర్వరన్.

హాయి — రాజా ! ఈబొబ్బిలిరా జస్మదపారఘోరాగ్నిలశతఘ్నికారావంబెఱుంగఁడు సుమా ! ఈరాజులుగీజులు మదాగ్రహానలమునకు శలభమాత్రులుసుమా ?

పంచచామరము. అరాతివీరవారమెల్ల నాకులంబుఁబొందమా
ఫిరంగికాఱుచిచ్చు వైరివీరసైన్యవన్యముల్
దురంతరీతిఁ జుట్టుముట్ట దుర్మదంబు వీఁడి వా
పరాసుఁజేని శక్తియుక్తి పౌరుషం బెఱింగెడిన్.

రాజు — స్వామీ ! అరిరాజన్యపుంగవహిరణ్యాక్షులు బొబ్బిల్యుర్వీధవమార్తాండసహస్రతేజోవిరాజన్నారసింహులకుఁ దృణప్రాయులుజుఁడే మీరెట్లూహించుచుంటిరో ?

హాయి — విజయరామరాజుగారూ! మీది వట్టిపిచ్చియూహ. మాఫిరంగిమండలంబుల ఘుటికానికాయంబునకుసిఫహసరదారుగా రంతటివారే కాందిశీకులైపోవుచుండ నీబొబ్బిలిరాజన నెంతటివాఁడు ?

గీ. తురకదొరలము మాతోడి దురుసదేల ?
భూమిబ్రతుకంగఁగలయిచ్ఛ వాఁడమి యున్న
నస్మదాగ్రహవహ్నికీలాళి యందుఁ
బడక యుండఁగవలెనుమీ పార్థివేంద్ర !

రాజు—కాని యీబొబ్బిలిరాజన్య మూర్ధన్యులు చిన్నతనమునుండియు శౌర్యమే యుగ్గుగాఁ ద్రావింపఁబడి పెంచఁబడినవారు. కాననేవారికంతశౌర్యము.

హుసే—మేముతక్కువవారమా ?

సీ. క్షణమాత్రమునఁగాదె జడిపించి విడిచితి మాళవచోళ నేపాళనృపులఁ
జేరుదస్తుకుఁగాదె జేర్చినవాఁడను శకసింధుఘూర్జరాశ్మంతపతులఁ
ఖయిదుఁ జేసితిఁగాదెఖాన్ బిరుదగుదార మరహాటకర్ణాటమత్స్యపతుల
శిక్షఁజేసితిఁగాదె శీలమేపారంగ నాంధ్రబర్బర పుళిందాధిపతుల

గీ. వీరికంటెను బొబ్బిలి విభుఁడు ఘనుఁడె
డక్కనుపఠాణి సేన నుద్దండ భీమ
భండనంబునఁ జెండాడు దండి తురక
బొరలమగుమాకు హిందువుల్బరమె ? రాజ !

రాజు—సాహేబుగారూ ! మీకాగ్రహమువచ్చునని జంకుచుంటింగాని నాయూహలో రంగరాయనికిఁ జాలిన రాజన్యగ్రామణు లెందునఁగానరారు.

గీ. అతనిఁజేరిన తృణమైన నతిఘనమ్ము
నమ్మునామాట నిజముగ నమ్ముసేయ
రాదు రాజునకేగాదు రాజనమ్ము
జూడఁ దత్సేవకాళికిఁ గూడఁ గలదు.

ఇంతేగాక.

ఉ. బెబ్బులిమీసమైన వడిబెట్టియు నుయ్యెల లూఁగ వచ్చుఁ బె
న్నిబ్బరమైన నెమ్మది ఫణీంద్రుని కోరల నూడ్చవచ్చు లో
నబ్బురపాటుజెంద నిసుమంతునఁ దైలముఁదీయవచ్చు న
బ్బొబ్బిలికోటపై విడిసి పోరఁగరాదిల నెట్టివారికిన్.

హుసే—ఇట్టిపిచ్చిప్రతాపంబులావర్ణించుట? మాసంగతిఁదెలిసియుండియుమీరిట్లువలుకనేల?

రాజు—అయ్యా ! మీరతనిఁజూచినంగాని నమ్మఁజాలరు.

హుసే—గీ. ఏల వాగెదవ వాకోట నేలకోఁడ ?
వారిశౌర్యాతిరేకంబు వారిమహిమ
దెలిసియుండియు మావిభు తేజ మల్ల
మాశతఘ్నులవేగంబు మాబలంబు.

మాప్రభావం బాభూరమణుతోఁ జెప్పకపోతిరా ?

రాజు—అతనినిబల్లకీయెక్కి నాకోట చెంతనైనఁ బోనియ్యనే ! వానితోనెట్లు మాట్లా డెదను ?

హాయి—క. ఆరాజెప్పటికైనను

మాతోటము బూను మదిని మారాముమెయి

న్భోరామిదేల నాకుం

బోరితమున వాని పొలుపుఁబొలియింతు నొగిన్.

వాని నూరక పోనిత్తుమే ? రంగరాయనిదోశ్శక్తియుఁ బరాసులతోని వీర్యాతిరేకం బుఁ జూతువుగాని.

రాజు—(తనలో) అదేనాయభీష్టము. వీనికి కోపానలము హెచ్చుచున్నది. చల్లా రకుండ నప్రియ వాగాజ్యధార గురియించితినా నావని నెఱవేరును. (ప్రకాశము గా) ఒక రంగారావే యనుకొంటిరా ? అతని తమ్ముఁ డన్నను మించిన పరాక్ర మశాలిసుమీ.

మత్తకోకిల. రంగరాయనితమ్ముఁడెంతయు రంగదాహవకేళిలో

నింగిముట్టఁగ నార్వఁగా నివినిద్రవైభవమేర్పడన్

భంగపాటొదవంగ మీపటుపారసీకపు సైన్యమా

సంగరంబున నిల్వనేర్చునె సాహెబాగ్రణి ! ధీరతన్.

హాయి—ఇదేమివెఱ్ఱి ?

క. బూసిసమానులు మీలో

బాసాడన్గలరె ? వారిబారాది బలు

ల్లానూఘానుని యొక్కని

బానలు వినినంతఁ గలనఁ బాఱరె చెఱుమా.

గీ. ఇట్టిగర్వాతిరేకంబు నెదను బూని

మా కమానుమమొనరించెగా కలుకక

మనదె మాయెద ? జూతువు మాబలంబు

వానిబలమును బోరాడఁ బార్థివేంద్ర.

మ. స్ర. దండిం దద్బాబ్బిలిక్ష్మాధవుల నిజభుజాదండ కోదండనిర్య

చ్చండాఖిల ప్రకాండచ్ఛదనగుణఘృణీచండరుకాండపజ్క్తిన్

శుండాలంబేర్చి కాన స్థారబడి తరువు ల్సుక్కుఁ జక్కాడు రీతి
స్పిండిగావించి వైతు స్ఫిరుదుమగల బొబ్బిల్గడి నుండ కుండక.

రాజా! వీరిద్దతేనా బొబ్బిలిలోనున్నవారు?

రాజు—తురుష్కాగ్రణీ! ఇంతేకాదు. రంగరాయాగ్రణి చెలికాఁడగు చెలికాని వెంకయ్య ప్రతాప మాధనదుని చెలికాని దోర్వీర్యంబును మట్టువెట్టుననుటకు సందియము లేదు. అందఱిని మించినవాఁడొక్కరుఁడు గలండు.

హుయి—వానిపేరేమి?

రాజు—వాని పేరా? తాండ్రపాపయ్య. వాఁడొక్కరుఁడు బొబ్బిలికోటఁ గాయఁ బెరవీరుండచ్చటఁ గాలుమోపఁగలఁడా?

క. ఊరులకాసించిన నా
యనమాన ప్రతాపవంతుఁ డగునాతనితో
మనఁగుట పోఱ న్నానుచు
మనలుటయే యేరికైన మానిత మధిపా.

హుయి—(వేలుఁగఱచుకొనుచు నాగ్రహముతో) లాడూఖాక్, హుసనల్లీఖాక్, లాసు మొదలగు మేటివీరులఁ జూచియుంటిరిగాదా? వీరిలో వా రెన్నవవంతు?

రాజు—ఇంతటితో నేమైనది. దామర దమ్మన్న, కాకర్లపూడి వెంకటరాజ భూజానుల పరాక్రమంబా వివ్వచ్చుని కెఱుక. ఇంతెందుకు.

గీ. తెల్వియుత్తెమ్ము లొకట హత్తించి నట్లు
బొబ్బిలి గడిని జేర్చెఁబో బెబ్బులితతి
నంతయుఁజ బ్రహ్మ వా రెంత యమితపుణ్యు
లహహ! బొబ్బిలి యెంత పుణ్యంబుసేసె.

హుయి—వీరందఱును గల్గిరను గర్వముచేతనే కాఁబోలు మదాజ్ఞోల్లంఘనంబా రాజమూర్ఖుండొనర్చె. అందుకు ఫలమాతఁడనుభవింపక తీరదు. నీవును దుర్వారపరాక్రమశాలివే నే! ఏమియుఁజేయలేక యూరకుంటివే? ఆవెలమ నీకంటె బలాఢ్యుండో కో?

రాజు—క. వాఁడెంత నాకుఁ దలపం
బోడిమి మెయి నిముషముననె పొలియించెదనూ

కోడిగము కాదు పూనికఁ
జూడుమిపుడె వానిపురము చూరగొనియెదన్.

దివాణమువారి కారాజొనర్చు దుర్మార్గములఁ జెవివేయకుండ నేమియు నొనర్పరా దని యూరకుంటిని. సెలవిండు. ఆపైఁజూడుఁడు. వానినేమి సేతునో. దివాణమువారి నెదిరించిన దివాణమువారే దండింతురు. నీకేలనని జనులు నన్నుఁ దూలనాడుదురు. కాకున్న నాకెంత. నాకుజడిసియే కదా నాకోట గుమ్మ మెదుర నడువనోడును ?

హాయి.—అట్లయిన మాలావుఁ జూతువు గాని.

రాజు.—ఏమిసేయ నెంచితిరి ?

హాయి.—గర్విష్ఠియై మాయాజ్ఞలను లక్ష్యము నేయక తనలావుఁ జూపింపనేకదా బొబ్బిలిరాజు మున్నిల్లి మమ్మవమానపఱచె ?

క. హల్లాచేయుదు బొబ్బిలి
ఖిల్లాలోఁగల్గుదొరలఁ గీర్తివహింతున్
జిల్లాబొబ్బిలి నూడని
యల్లాచరణంబులాన యదినీకిత్తున్.

రాజు.—ఆత్మను మిగులహర్షించి (తనలో) నాపుణ్యము బాగుగ నున్నది. ఈపరాసులతేనికి నుగ్రమైన యాగ్రహముఁ దెప్పించితిని. వీరిమూలముగ బొబ్బిలి కోట నాశంబునొందించి యారాజ్యము నా వశంబు గావించుకొందును. ఈతురకలు ధనకాంక్షగలవారు. విశేషధనము నానపెట్టితినా నాకీ యుపకారముఁదప్పక యొనర్తురు. (ప్రకాశముగా) యవనావతంసా !

క. అటులైన నిత్తుఁజూవే
పటురభసముతోడ మీకు బాళి తుదంటన్
దటుకున లక్షలు పదిరెం
డటె నా టెక్కియము నెత్త నలవఱచిన చోన్.

హాయి.—మంచిది. ఆమాటలు నిలుపుకొనుము. (తనలో) ఈరాజు పన్నెండు లక్షల నిత్తునని వాగ్దాన మొనర్చుచున్నాఁడు. కానిమ్ము. ఆదేశము నీరాజునకిచ్చెదను. (ప్రకాశముగా.)

క. నీకిచ్చెద నారాజ్యము

ప్రకటముగఁ దలను బుఱ్ఱ వాడక యుండక
శ్రీకరుని జేతు నట గో
త్రాకాంతా! యనుము మగుడఁ దగ నామాటల్?

రాజు—రంగరావుని గెల్చి బొబ్బిలికి నన్నభిషిక్తునిఁ జేసిన మీకుఁ బన్నెండు లక్షల నుపాయనంబిత్తు.

హైద—మంచిది. నీయభీష్టానుసారంబుగ నిన్ను బొబ్బిలి కధికారునిగఁ జేతు నాతమాషా దేఖో!

రాజు—(సంతోషించి)

మ. అలఘుప్రాభవ శౌర్యశాలివగుదీ వట్లెంతయు న్జేయ నీ
కిలఁ దుఃఖ్యంబు గలండె ధైర్యమున నేఖిల్లాలఁ గన్గొన్న? నీ
తులువ న్గెల్చుటదెంత మీకుఁ దలఁప న్దండంబుచేఁ దుంగము
న్తల వీఁకన్సైకలించిపై చు మదభూదారంబు చందంబుగన్.

పారసీకాగ్రణీ! నీవట్టివాఁడవేగాని వారు సామదాన భేదోపాయఁబులచే నజేయులు సుమీ. చతుర్థోపాయంబగు దండోపాయంబే కర్తవ్యము. దానిచే తంగానిసాధ్యుండు గాఁడు.

హైద—మమ్ము సరకుఁగొనక తిరస్కరించు వానితోనా మాకు సామ దాన భేదోపాయంబులు. నేనన్నమాటఁదప్పక జరిపి తీరువాఁడ నానత్యసంధత నిరీక్షింతువు గాని.

రాజు—గీ. పలికి బొంకరు మీవంటివారు భువిని
నిగ్రహానుగ్రహంబుల నెలవుపట్లు
మీరు యవనావతంస! మీ మేటిగుణము
లెన్న వశమానె యావేల్పుమిన్నకైన?

అయిన నట్లుచేతుమని సమయం బొనరించుకొం టెందులకు మంచిది.

హైద—రాజా! సర్వదిఙ్మండలీ విభ్రాజిత యశోధారేయుండ నగు నాయట్టివానికి రెండునాల్కలు గల్గునా? అయిన నీవు కోరితివి గాన
మత్తకోకిల. కత్తిముట్టిచెప్పుచుంటిఁ గాన భీతిఁ దక్కుమా
రిత్తమాటగాదు భూవరేణ్యా! నమ్ముమింక నీ
చిత్తమందు సంతసంబుజేర్పు మల్ల బొబ్బిలిన్
పొత్తుగాఁగఁజేతు నీకుఁ జూడుమా లఘుక్రియన్.

రాజు—(తనలో) నాకోర్కె నమకూరునట్లున్నది. బుస్సీ యేమనునో. (ప్రకాశము
గా) హయిదరుజంగు సాహేబా! బుస్సీ యీకోనునా?

హాయి—క. మేమెంతచెప్ప నంతయు
భూమాన్యచరిత్ర! జరుగుఁ బోడిమి మీఱం
గా మంత్రులు సెప్పఁగ వినఁ
బోమనియెడి నృపులు గలరె భూస్థలినెందున్.

(రహస్యముగా) ఇప్పటి నరపతులను జూచుచుంటిరి గదా? వారు గొప్ప యుద్యో
గస్థులన్నమాటయే గాని వ్యవహారవ్యక్తత పూజ్యము. వారు కచ్చేరీ మొగమే
యెఱుంగరు. మేమెంతచెప్పిన నంత జరుగఁగలదు. వారుగారు ఖామందులు నేను.
నీకెందుకు?

రాజు—సత్యము. ఇఁక నే ననుజ్ఞ వడయుదును గాక.

హాయి—మంచిది పోయిరమ్ము.

రాజు—(తనలో) ఈసంగతిని బూసీతో హాయిదరుజం గీరేయి జెప్పును. అర్థకాం
క్షఁజేసి నాయుద్యమంబున కంగీకరించియున్నవాఁడు. నేను ముందుగఁబోయిపెద్దా
పురమున నుండెదను. (ప్రకాశముగా) పారసీకాగ్రణీ! నాకీరేయిఁ బెద్దాపు
రముబోవ సెలవిండు.

హాయి—అట్లనే జేయవచ్చును.

రాజు—సలామ్

హాయి—సలామ్

రాజు—(నిష్క్రమించుచున్నాఁడు)

(బుస్సీ ప్రవేశించుచున్నాఁడు)

హాయి—(లేచి) సలామ్. ఫరాసువంశాగ్రణీ!

బుస్సీ—సలామ్. మంత్రిపుంగవా! ఈమకామున జమాబందీ పూర్తియైనదా?

హాయి—స్వామీ! విజయరామరాజాదిగా శ్రీకాకుళంబునంగల సమస్తదేశాధీశ్వరు
లు వచ్చియున్నారు. వారితోఁడంగల కార్యము లన్నియు ముగిసినవి.

క. నీవడుగుకతనఁ జెప్పం
గావలసెను బొబ్బిలి భువికాంతుఁడు దక్కం

గావసు ధావరులందఱి
దే వచ్చిరి యాతఁడెట్టి దిట్టఁడొ తలఁపన్.

బు—అదేమి? కారణంబారసితివే?

హాయి—ఏమని చెప్పుదును. ఈజమీదార్లలో బొబ్బిలిరాజు ప్రతాప వీర్యాతిరేకంబుల ఘనుండఁట.

గీ. నిష్ఫలంబయ్యెఁ దాఖీదు నింద్యమయ్యె
వానియభిమతమేఁగంటి వాఁడె సర్వ
భూమిఁ బాలించునఁట నింకఁబూని క్రొత్తఁ
జెలఁగి రాహాడి పోరితములను మనల.

బు—ఏమీ? ఆరాజునకట్టి సామర్థ్యంబు కలదా?

చ. ఎఱుఁగఁడొ? రంగరావు నను నెల్లపరాసులతోఁడు బుస్సియం
చెఱుఁగఁడొ? మాపరాక్రమము లెంతయుఁ బావకమూర్తులంచు వాఁ
డెఱుఁగఁడొ? మాశతఘ్నిజలభృన్నిచయోర్జితరావమేర్పడన్
బరిగత ధాంధమీ నినద ప్రస్ఫుటితార్భటి యాజిరాజిలన్.

హాయి—మన బాహుశక్తిఁ దెలియక యిట్టి వెఱ్ఱియూహంజేసి యున్నాఁడు.

బు—మనబలం బాతనికిఁ దెలియఁజెప్పిన వచ్చి మన పాదాక్రాంతుండగునేమో?

హాయి—ఆసందేహమును విడిపోయినది. తనవలెనే భుజపరాక్రమశాలులగు తమ్ముఁడు లోనగు ననేక వీరులు చెంగటనుంటంజేసి సామాద్యుపాయంబుల వశుఁడగు నట్లు లేదు.

గీ. నమ్మఁగారాదు సుమి యిట్టి నరపతులను
జేతురెపుడైనఁ గూడని చేతలిపుడ
గరువమడఁగించినంగాని కాలమరుగ
సాధ్యుఁడగునంచు నేనెంచ సామి! నిజము.

బు—హా? పరాసులతేని కోపాగ్నియందు
దైవప్రేరేపణముచేత రావు వంశ్య
శలభతతి మ్రగ్గఁగానుండ జగతిలోన
నన్యథా యెట్లు జరుగఁగ నౌను చెపుము.

ఇందుకు నీవేమి యాలోచించితివి?

హాయి—నేనును సామ దాన భేదోపాయంబుల సాధ్యమగువఱకు రణముఁ దప్పింప నెంచితినిగాని వ్యవహారసరళి మీఁదుమిక్కుటముగ వచ్చినది.

క. మనదార్ఢ్యం బీవెలమలు
గనఁజాలరు దిట్టతనము గలదంచును నే
రినిగాని జీరికింగొన
రనవద్యచరిత్ర ! మన్నెయధిపులమనుచున్.

వీరును గేవలముదుర్బలులుగారు సుమా !

క. ఆమన్నీనిం గన్గొన
భీమభయంబొదవు మదిని వీరతతికిన్
సీమగలారికి నిక్కవ
మామన్నియ పులియటంచు నడరెద రధిపా.

వారు నిజముగ మనకుఁ జాలకున్న నితరులకు బెబ్బులిప్రాయులనుటకు సందియము లేదు. వారిలోఁ దాండ్రపాపయ్య బహుబాహుబలశాలి.

బుస్సీ—ఆహా! ఇప్పుడేమి సేయుదము? నిన్నడుగనేల. దండోపాయమె కర్తవ్యము అది తప్ప వేఱేమున్నది? ఇట్టి గర్వగ్రంథుల గంథమడఁగించినంగాని మనకు క్షేమము లేదు.

హాయి—విజయరామరాజు ద్వాదశలక్షల రూప్యంబుల బొబ్బిలిఁ దనకిచ్చిన నిత్తునని వాగ్దానము సేయుచున్నాఁడు. అట్లొనర్చిన నావీరుని గెల్చినవారమును బలవంతుని జేపట్టినవారము నగుదుము. ఇది యుక్తియుక్తముగ నుండునేమో?

బుస్సీ—బహుచక్కగనున్నది. పైగా ద్వాదశలక్షల రూప్యంబులు గూడ సమకూడె. హిందుస్థానములోని పరాసు దొరతనమువారికీసమయమున ధనముఁగూర్చితిమా వారు బహుసంతసింతురు.

క. ద్వాదశలక్షల రూప్యఫ
లోదయజయలక్ష్మి వలసి యూరక తనుదా
నాదటవచ్చిన మనమిఁకఁ
గాదని త్రోయంగఁ బురుషకారమె చెపుమా.

గనుక నీయాలోచన గణ్యమైనది.

హాయి—నేనైన నిప్పుడే తొందరపడనుసుమా. ముందుమకాముకైన వచ్చి సకారణముగ క్షమాపణఁగోరిన విడుచువాఁడనే.

బుస్సీ—అట్లు చేయఁదగినదే. అయిన నింకొక యుత్తరువునంపుము.
హాయి—అప్పుడును రాకున్న నేమిసేయవలె సెలవిమ్ము?
బుస్సీ—అట్లైన మనమనుకున్నదే మార్గము.
హాయి—నాగోజీరావుగారూ! ఇటురండు.
నాగో—ఏమి సెలవు? మంత్రివర్యా!
హాయి—ఆజ్ఞప్తిపత్రికను వ్రాసి బొబ్బిలిరాజునకంపుము.
నాగో—అట్లనే చేసెదను స్వామీ. (అనివ్రాసి నౌకరుం జూచి) సేవకా! నీవుపోయి బొబ్బిలిరాజునకీపత్రిక నిచ్చిరమ్ము.
సేవ—చిత్తము దేవరా! (అనిపోవుచున్నాఁడు)
హాయి—బుస్సీగారూ!

గీ. విజయరామరా జగు నిల విజయరామ
రాజు సుమి రాజవరులలోరా జితండు

బుస్సి—నిజము హైదర! నీమాట నేనెఱుంగుదుఁ
బాదుసాతోడఁ బోరెడిపట్లవాని.

హాయి—హిందూరాజులలో మిక్కిలి యౌదార్యవంతుఁడును శౌర్యశాలియు బలవంతుఁడును.
బుస్సి—నిజము. (అని నిష్క్రమించుచున్నాఁడు)
హాయి—సేవకా!
సేవకు—దేవరా! ఏమి సెలవు?
హాయి—నీవుపోయి చమూపతిం దోడ్కొనిరమ్ము.
సేవ—(పోయి వెంటఁగొనివచ్చుచున్నాఁడు)
చమూ—సలామ్ స్వామీ యేమి సెలవు?
హాయి—కొంతమంది సిపాయీలనంపి బొబ్బిలి నల్దిక్కులారసి వీథుల గొందుల సందులనెమకి జంగల్ ఝాడీ మైదానంబులఁ గలయంగనుంగొని కోటత్రోవలఁ బరీక్షించి బురుజుల సేనల ఫిరంగులఁ జూచి కానల కోనల సీమల నవలోకించి వేగరమ్మని చెప్పుము. పొమ్ము.
చమూ—మహాప్రసాదము స్వామీ. అట్లేయొనర్తును.
(అని పోయి సిపాయీలఁ బంపుచున్నాఁడు)
(అందఱు నిష్క్రమించుచున్నారు)

# శ్రీరంగారాయకదన సమవాకారము.

## ద్వితీయాంకము.

రంగము :—బొబ్బిలిలోనివీధి.

(వెంకటసోమయాజులు, రామశాస్త్రి ప్రవేశించుచున్నారు)

వెంక——రామశాస్త్రీ! విశేషములేమి? దివాణములో వివాహములంట యెప్పుడు? నీవు వారి పురోహితకోటిలోవాఁడవేగాన నీకుఁదెలియకపోదు.

రామ——సోమయాజులుగారూ! ఈనెలలోనే ముహూర్తమేర్పఱచినాము.

వెంక——శాస్త్రీ! ఇదిగో. మహారాజవు. నామాట మఱచిపోకుసుమీ. ఈమధ్య యజ్ఞముచేసినాను నీవెఱుఁగుదువుగా.

రామ——జన్నమొనరించితిరా? ఇంకేమి? కాని మన మదృష్టవంతులముగాము. ఈ వైవాహికములలో మనదరిద్ర విచ్ఛేదమగును గాని దైవము వేఱుగాఁ దలంచుచున్నాఁడు.

వెంక——నీమాటలవలన నేదో యాటంకము గల్గినటులఁదలంచెద. చెప్పుము.

రామ——ఇంకెందుకు. పుట్టెడాసపెట్టుకొన్నందుకు నిష్ఫలమైనది.

వెంక——నేనేరితోడను జెప్ప నదేమో సెలవిమ్ము.

రామ——మనదేశాధిపతులైన బుస్సీదొరవారు రాజమహేంద్రవరమువచ్చి జమీదార్లకం పఱకు వార్తలనంప నందఱికంటె ముందు విజయరామరాజుగారేగి పన్నెండు లక్షలు లంచమిచ్చి బొబ్బిలికోటం దనకుఁ గలుపుకొను విషయమై తనగిన యేర్పాటు పైదరుతోఁ జేసికొనెనఁట. ఈరోజుననో రేపో వారందఱిటకు యుద్ధసన్నద్ధులై వచ్చుచున్నారఁట.

క. కొండెములుసెప్పి మిక్కిలి
గండం డని రాజు మిగులఁ గార్పణ్యముతోఁ
జెండుకొనిమొగము వారికి
గఁడువిరోధునిగఁజేసెఁగాదే నృపతిన్.

ఏమిచెప్పను? ఈమాట వినినప్పటినుండియు నామనంబు స్థానంబు వాసె.

సోమ—క. నిర్భాగ్యుల మనఁదగుదుము
గీర్భామాధవుని వ్రాలు గేలియొనర్పన్
దుర్భరము. చూడుమీ రా
ట్సర్వ్భాపతి కెట్టికీడు సమకూడినదో ?
విజయరామరాజే యొనర్చెనా ?

రామ—సమస్త బాంధవులరుగుదెంచియున్నారు. కోటలోఁ బెండిలిపనులు జరుగుచున్నవి. పురిజనులు నుత్సాహముమీఱియున్నారు. ఇంతలో నింతపుట్టినది.

వెంక—మనరాజుగారిమధ్య రాజమహేంద్రవరము చనుదెంచెదరని విన్నామే. ఏల పోలేదు ?

రామ—ఈరోజుననే బయలుదేరనైయుండఁగా నీవర్తమానము యాతాయాత పథికజనవ్రజంబుచేఁ జూచాయగఁ దెలిసి మనతేఁదు నాసికాగ్రంబునఁ గొనవ్రేలునునిచి యారాజానర్చిన యొగ్గుం బహుభంగుల నుగ్గడించుచుఁ బ్రయాణంబు మానినార్ట. నేను నాపాంధుల వలననే వింటిని.

వెంక—అయితే కార్యము లాపుదల కావలసినవేనా ?

రామ—క. మునుమున్న పోరు సాగఁగఁ
గననెట్లగు నిఁకను బెండ్లికార్యంబులు నే
ననుకొంటి దైన్యమఱునని
మనభాగ్యము లిట్టులుండ మఱినేమెల్లా.

వెంక—ఎన్ని పెండ్లిండ్లు గాఁదలఁచియున్నవి కోటలో ?

రామ—దాదాపునూఱు. అన్నియు వారివి వారిబంధువులవి.

వెంక—విజయరామరాజున కెట్టి యపకారమొనర్చె మనరాజు ?

రామ—మనరాజన్న నాయన కెప్పడు నసూయయే.

వెంక—ఇంతేనా కారణము ?

రామ—క. గిరినిర్ఝరములనాఁగఁగ
బిరబిరమనవారు, వారుబిరుసుఁదనంబుం
బఱపిన, వారినిమట్టిరి
చురచురమనఁబోలు రాజచూడామణికిన్.

వారిదేశమునుండి పాఱుకాల్వల వారడ్డముకట్టికొనఁగూడదా ?

రామ—ఇదివఱకు నాదినుండియు నూరకున్నహేతువుచేఁ దప్పనిసరియైనది. ముందు

సందిచ్చినఁబర్యాయంబున “సేకుమేకైబిగియును” గదా.

వెంక—గీ. తనకుమాలిన ధర్మంబు దగునె యెట్టి
పనుల. మనకాల్వలేమి? యామనుజులడ్డ
గింత యదియేల? యాభూమికాంతుఁడెట్టి
కార్యమొగిఁజేసెఁ గూడని కర్జమనక?

అటువంటివైరుధ్యకులున్న ముఖాముఖీని బొత్తుపఱచుకొనవలెఁగాని యిట్టిపనినా యారాజశేఖరుండు సేయవలసినది? పరశ్రేయము నోర్వవలదా?

రామ—సాధించు సాధనంబుఁ జింతించి చింతించి తుదకిట్టికార్యమాచరించె. కానియేమి జరుగునో చూతము. (అందఱు నిష్క్రమించుచున్నారు)

రంగము: బొబ్బిలిరాజుసభ.

(రంగారావు, బంధువులు, మంత్రులు, మిత్రులు నౌకరులును బ్రవేశించుచున్నారు)

రంగా—మంత్రులారా!

మంత్రి—మహాప్రసాదము స్వామీ.

రంగా—చారులు వచ్చిరా?

మంత్రి—ఇదె తమదర్శనమునకరుగుదెంచుచున్నారు రాజేంద్రా.

(చారులు ప్రవేశించుచున్నారు)

చారు—జయజయమహారాజ! రాజన్యానేకపసింహా! మహావైభవదేవేంద్రా! రావు వంశ కలశపాథోధి సంపూర్ణసుధాకిరణా! రంగారాయ కుంభినీ వల్లభా! పరాక్.

రంగా—వార్తలేమిరా?

చారు—మహారాజా! ఏమనిచెప్పుదుము. నుడువుటకు నోరురాకున్నది?

రంగా—నాకు నిప్పుడే తెలియవచ్చినది. మీకుఁదెలిసినది వ్రాకుప్పుఁడు.

చారు—దేవరా! సరకారులభారంబు వహించి బుస్సీదొరవారును, వారిమంత్రిపుంగవులగు హైదరుజంగును గడచిన డిశంబరు నెల 19 వ దినంబున రాజమహేంద్రవరంబుఁబ్రవేశించియున్నారు. అచ్చటికి విజయరామరాజాదిగాఁగల నరపతులునువచ్చిరి. ఆరాచమిన్న హైదరుజంగుతోఁ దమపైఁ గొండెములుసెప్పి యాఖానుస్దమకు బలవద్విరోధునిగఁజేసె. అంతేగాక యాతని వలన 12 లక్షలు లంచమొంది బొబ్బిలి కోట నిత్తునని విజయరామరాజుతోడఁ గట్టిముట్టి హైదరు వాగ్దానముఁజేసియున్నా

డు. వారందఱును బయలుదేరి మనకోటపై రేపో నేఁడో విడియనైయున్నారు. ఇది య రాచకార్యము.

రంగా—ఏమీదురాగతము? చూచితిరా మంత్రులారా! మిత్రులారా! దీనినవలో కించితిరా? చారులారా! వారెప్పుడెచ్చటనున్నారు?

చారు—స్వామీ! రేపు పెద్దాపురము వెళ్ళనైయున్నారు. అచ్చటనుంచి ఖాసింకోట పోవుదురఁట

చె. వెంక—ఇట్టి క్రూరకర్మమారాజునకుఁదగదు.

రంగా—ఉ. త్రాఁచువిధంబునం విజయరాముఁడొనర్చిన నీచకృత్యము
న్జూచితె తమ్ముఁడా! తగదుసుమ్మిది ఛీ యనకే తురష్కుఁడిం
తౌచితిలేక దాని విని యూననిచేసిన యాప్రతిజ్ఞయు
సైఁచెదరే యధర్మములఁ జచ్చినఁజత్తురుగాని యుత్తముల్.

నరస—పౌరుషశాలియా రంగారావు వెనుకదీయునని యెంచెఁగాబోలు.

పాప—నాదోస్సామర్థ్యంబుసూపఁ గాలంబు తటస్థించినది.

రంగా—సభికులారా!

ఉ. రా జవినీతుఁడైనను బరాసులతోనికిఁనైనఁ గల్గదే
పూజితమైనబుద్ధి? తగుపాత్రానరించుట మేలుగాని యు
వ్యాజముగాఁగ నిట్లుదగవా పగవారలతోడఁ గూడి యీ
యోజ మహాపచారముల నొప్పమి చేయుట? మెత్తురే జనుల్.

మంత్రి—కూడనిపని రాజా!

రంగా—అమాత్యశేఖరులారా!

గీ. చూడఁబోవుదమూఖాను జాడకనుచుఁ
దగిన జతనంబుమీఱ నందఱమునుండ
నింతలో నెంతపుట్టెనో నేర్పరింపుఁ
డయ్యొ యటకేగుటది యిప్పుడగునో కాదొ?

మంత్రి—రాజా! అట్లుపోవఁజనదు. వకీలునేరినైనఁబనిచి తెలిసికొనినంగాని పోరాదు. శౌర్యమున్నమనతోఁ బోరవలెఁగాని మసలిమానుతోఁ జెప్పుకొనవలెనా? తనంతటఁ దాజయించినఁబౌరుషము పరాసులశరణు వేడుటేటినదువడి? ఏమిప్రతాపనిధి విజయరామరాజు! ఇంతతగవు మాలినయుద్ధంబునకుఁ దొడ్పడుటకాబుస్సీ యెట్లీకొనె.

గీ. తగవుఁదప్పకనీతివర్తనముచేత
మనల వారల సమదృష్టిఁగనిన నరియె
మనదివాణంబువా రట్లుమదినిఁబూన
లేని సమరంబుదప్పదుపో నిజంబు.

రంగా—అదినిజము మంత్రిపుంగవా ! మనమేనా తీసిపోవువారము. హైదరడ్డుపడనిమ్ము పురారియడ్డుపడనిమ్ము. గెల్చిరావలె చచ్చిపోవలె. (మీసముపైఁజేయివైచికొని తలపంకించుచు.)

శా. రేచెర్లాంచితగోత్రసంభవులు నిర్నిద్రప్రతాపక్రియా
వ్యాచష్టాత్ములు రావువారు హరుఁడేనన్యాయయుద్ధంబునం
కోచంబొందకజేయవచ్చిన మహాఘోరాస్త్రవిద్యాధిక
ప్రాచుర్యంబునుజూపకే మగిడిపోవం జూడ రొక్కింతయున్.

కానిమ్ము కానున్నదికాకమానదు వట్టిబీరములిప్పుడేల ?

కం. వైవాహికకార్యములీ
సావి ననేకములఁదలఁపఁ జాగయ్యెను గా
పోవంగనటకు సచివా !
యీవసుధాజాని యెట్టి యపకృతిఁజేసెన్.

ముందేదండోపాయమునకుఁ గడఁగుటకంటె మఱియొకరీతిఁజేసిన నాపరాసులకేఁ
డిట్టియుద్యమంబుమాననేమో ?

మంత్రి—మొదటనేయుద్ధముకంటె సామదానభేదోపాయంబులఁ గార్యంబుల నమకూర్చుకొనుట బహుశ్రేయోదాయకమును, రాజనీతియు గడుసుఁదనమును గాదా ? అదేమో సెలవిండు.

రంగా—అమాత్యవరా ? ప్రస్ఫుటభృత్యట్టహాసనిరస్తసురాలయ హిమవద్వింధ్యాద్రి రాణ్మందరుండును, పరాసుగోత్ర క్షీరసాగర క్షపాకరుండును, దేశరక్షక సైన్యాధ్యక్షుండు నగు గోరుదొరవారు బృందావనపురంబునఁ గలఁడు.

గీ. మున్నుపనివిని యీరాజుసన్నిధికిని
మావిరోధంబు లతనికి మనవిఁజేయఁ
గూర్చె సఖ్యంబు మా కిరుగురకు వైర
భావ మెంతయుఁగూడని పనియటంచు.

మఱియును నన్నాదొరగా రన్వయనామగోత్రంబులతోడ నెఱింగి యున్నవాఁడు
ఇంతేగాక.

క. ఈరాజునకు న్నాకు
న్నోర్బాటము గలదటంచుఁ బుయిలోడమటం
చేరాయిడిలోఁ సైనను
గోరుం దొర యెఱుఁగుఁజుమ్మి కూరిమితోడన్.

గనుక హైదరుజంగుతోడఁ బ్రసక్తి లేకయే వారిచెంతకరుదెంచి వీరిపేరట సత్తర్వు
లవ్రాయించి పంపించుటమంచిది.

గీ. వారిపేరట లేఖలవ్రాయఁజేయ
హరికరంబుల నీహారమడఁగుకరణి
భూపుఁరోగ్రోధ నీరదబుధ్నదం బ
టంచు బుస్సికిఁ దెలియక డక్కునొక్కు.

మంత్రి—రాజేంద్రా! ఇంతకంటె వేఱాలోచన యేమి? బాగుగనాలోచించితిరి.

రంగ—ఆపని కేరిని బంపినబాగుగనుండును?

మంత్రి—ఈపనికిఁబంతెన బుచ్చెన్నగారిం బంపిన బహు యుక్తియుక్తము.

రంగా—మంత్రివరా! మంచివానింబేర్కొంటిరి. బుచ్చెన్నగారూ?

బుచ్చె—మహాప్రభూ! ఏమిసెలవు?

రంగా—మత్తకోకిల. పంతెనాన్వయవార్ధిచంద్రమ! భవ్యరాజవరేణ్య కా
ర్యాంతరంబులఁదీర్ప నంచితమైన వాఙ్నిపుణత్వమం
దింతయంతని నిన్ను నేనులియింపనేర్తునె సాటి గో
రంతయేనియు నీకు నిజ్జనులందు నెందొకఁడుండునే?

గనుక నీవేగి యాగోరుందొరకును, వారి దుబాసీయగు మద్దాల రెడ్డినాయనికి నీయు
దంతంబాద్యంతంబు విశదపఱచి వీరియుద్యమంబు మానుటకుఁ దగిన యుత్తర
ముల వ్రాయించి బుస్సీదొరగారికిఁ జూపించిరమ్ము. నాకిదేయుపకారము.

బుచ్చె—గీ. ఈశరీరంబునీయది యాశ! యిట్లు
వేఁడగానేల? మీపన్పుఁ బేర్మిఁజేయు
కంటెఁ బరికింప ముఖ్యమౌ కార్యమెద్ది?
పనివినెదఁగాక రాజేంద్ర! పంపుమిపుడ.

రంగా—మిగులసంతసంబయ్యె. బుచ్చెన్నా. అట్లయిన నీకిదే యాజ్ఞ.

బుచ్చె—మంచిది రాజేంద్రా! ఇదే పోయివచ్చెద. (అని నిష్క్రమించుచున్నాఁడు)

రంగా—మంత్రివరా! సైనికనికాయంబును దగిన యుద్యమంబున నుండఁబంపుము.

మంత్రి—చిత్తము స్వామీ!

రంగా—వెంగళ్రాయఁడా! చూచితివా. ఎంత జరిగినదో.

వెంగ—అన్నగారూ! కానిండెట్లుజరుగునో చూతము.

(బంట్రోతులు ప్రవేశించుచున్నారు.)

బంట్రో—సలామ్ మహరాజ్ మాయేలికయగు హైదరుజంగుసాహేబు తమకిమ్మని లేఖనిచ్చినారు ఇదిగో. (అనియిచ్చుచున్నారు.)

మంత్రి—(పుచ్చుకొనిచదివి) రాజా! మనలఁదక్షణము వారివద్దకురమ్మని లేఖవ్రాసిరి. ఇదియవర్తమానము.

రంగా—మంత్రివరా! ఈబంట్రోతులకు బహుమతులనొసఁగి పంపివేయుము.

మంత్రి—చిత్తము స్వామీ! (అని గుప్పెడురూపాయీలఁ దీసియిచ్చుచున్నాఁడు.)

బం—సెలవుపుచ్చుకొనుచున్నారు.

రంగ—అమాత్యుఁడా! పత్రికధోరణియెట్లున్నది?

మంత్రి—లేఖఁజూపుచున్నాఁడు.

రంగ—(చూచి) నరసాగ్రణీ! ఈపత్రికఁజూడుము వ్రాఁతలోనేయింత దురాగ్రహము కన్పించుచున్నదే చూచిననెట్లుండునో? ఏమైననునరేపోవుదమా?

నరస—అంగుడుదుడిపి యగురాజచ్చటఁజేరి మనపైకొండెములుసెప్పి ఖానునిమిగులనంకాపాంకముగలవానిగానొనర్చె. అట్టివానిచెంగట కెట్లు బోవనేర్తుము ఇంతేగాక.

గీ. ఖానుసర్వాధికారి నిష్కారణంబ
దిట్టినందిట్టఁగలవాఁడు ధీమసమునఁ
బూనిపోయినఁదొసఁగులు పుట్టునేమొ
వైరిరాజుండుటంబట్టి వారికడను.

గనుక నిచ్చటికి నొండువకీలునంపి తెలుసుకొనుటమంచిది.

రంగా—అట్లైన నేరిని బంపుదము?

నరస—క. భూమిప! బుచ్చెనకెన యీ
డామర దమ్మన్న గానఁ దగునీపనుపున్

సేమముగఁజేయు నొరులిల
భూమహితచరిత్ర! వీనిఁబోలఁగలారే ?

ఇదివఱకు బుచ్చెన్నను బంపియుంటిమిగాన నిప్పుడీయనన్నంపుట యుక్తమనితోఁచెడి ని. చెలికాని వెంకయ్యగారినిగూడ సహాయమిచ్చుటనుంచిది.

రంగా—అవును చక్కఁగఁజెప్పితివి. సేవకా! దమ్మన్నవెంకయ్యగార్లనుబిలుపుము.

సేవకు—మహాప్రసాదము రాజేంద్రా! (అనివెంటఁగొని వచ్చుచున్నాఁడు)

దమ్మన } వెంక } —దేవా! ఏమి సెలవు ?

రంగా—మీరు మాకొక్కయుపకారమొనర్పవలెను.

ద, వెం—అట్లు నుడువకుఁడు మేము తమ బిడ్డలము. తండ్రి తనయుల నిట్లనునె ?

రంగా—సరసాగ్రేసరులారా! మీరేగి యీయుత్తరమును హైదరుజంగునకిచ్చినిష్కారణము వైరమూని వ్యదీకంబుల నాచరించుట పాటిగాదని వలసితిరేని యారాజిచ్చినదాని కినుమడుఁగుల రజతంబు సమర్పింతుమని, కాదంటిరా మమ్ములఁబోరనిచ్చి యాపైని జయమందినవారికి నేల నిచ్చి యనంబుఁబొందుమని యట్టి యటమటకాఁడు నుడువు టకుటొంకుమాటలచే మనంబున గాంతాళంబుబూని మాకు విప్రలంభమొనర్పఁజూచుటదెంతయు నన్నెకాండ్రపనిగాని మీవంటి వారికిఁ దగినది గాదనియుఁ జెప్పుము. మఱియు

గీ. న్యాయహీనంబుగా దినాణంబువార
లిట్లుచేయుట దగవుకా దిరుదెఱఁగుల
వారినొక్క సమముగ నిష్పక్షపాత
బుద్ధినరయుట మేలని బోధనెఱపు.

ద, వెం—అదెంతపని రాజాగ్రణీ! ఇదిగో పోయివచ్చెదము.

(అని వెడలి పోవుచున్నారు)

(అందఱు నిష్క్రమించుచున్నారు)

రంగము :—బందరు.

(గోరుంటొర, మద్దాల రెడ్డినాయఁడు, సేవకుఁడు ప్రవేశించుచున్నారు)

గోరు—రెడ్డివరా! లష్కరిప్పుడెచ్చటనున్నదో వర్తమానము వచ్చినదా ?

రెడ్డి—రెండుమూఁడు దివసంబులలో ఖాసింకోటకుఁ బోవనైయున్నదఁట.

గోరు—వారచ్చటనుండి మరలివత్తురా? లేకింకను ముందునకే గెదరో?

రెడ్డి—పైకిఁబోపునట్లేయున్నది. ఇంతటితో వెనుకకు వచ్చునట్లులేదు.

గోరు—కారణమేమి?

రెడ్డి—నాకును బోధపడకున్నది. దొరగారూ!

సేవ—స్వామీ! ఎవ్వరో తమదర్శనంబునకు వచ్చియున్నారు.

గోరు—సేవకా. ఇటుదోడుకొని రమ్ము.

సేవ—చిత్తము దేవరా! (అని తీసుకొని వచ్చుచున్నాఁడు)

(బుచ్చెన ప్రవేశించుచున్నాఁడు.)

బుచ్చె—సలామ్ దొరగారూ!

గీ. నేను బొబ్బిలికాశ్యపీజాని రావు
వంశవీరగ్రామ్యు గోపాలకృష్ణ
రంగరాయవరుం డంప రయముమీఱ
వచ్చినవకీలు నయ్య! నన్బుచ్చెనందు్రు.

గోరు—అయ్యా! ఇటుకూర్చుండుము. (అని కుర్చీచూపుచున్నాఁడు)

బుచ్చె—కూర్చుండుచున్నాఁడు.

గోరు—రంగారావు సుఖియైయున్నాఁడే?

బుచ్చె—తమయక్షీణకటాక్షవీక్షణంబుల నతిక్షేమంకరుఁడై యింతవఱకున్నవాఁడు స్వామీ!

గోరు—ఏమి యట్లనెదవు? కంఠంబునఁబ్రాణంబులుండఁగ వానికి నసుఖం బొనరించువారుగలరా? (మంత్రింజూచి)

క. ఆతనిధైర్యస్థైర్యము
లాతనిశౌర్యాతిరేక మారయ గణనా
తీతములుగావె రెడ్డీ!
యాతనినీవెఱుఁగవొక్కొ? యలఁతియెచెపుమా.

రెడ్డి—ఉ. ఆయతశౌర్యహేళి సుగుణాయతశాలి యశోస్తశాలి వి
ద్యాయనపాళి సంచిత మహాహవకేళి యరాతికీలి యా
ధీయుతరంగరాయనృపతి స్ఫుటవిక్రమ మెందు డాపనౌ
నాయినుతేజ మెవ్వరికినైనను మాయవశంబె తెల్పుమా.

గోరు—రెడ్డివరా! నీవుచెప్పినది బహుబాగుగనున్నది. పంతెనవంశాగ్రణీ! నీరాకకుఁగతంబేమి?

బుచ్చె—దొరగారూ! పరాసువతంసంబగు బుస్సియను మంత్రిపుంగవుండగు హైదరు జంగును శ్రీకాకుళపు జమాబందీ నిమిత్తమై యరుగుదెంచి విజయరామరాజు దురుపదేశంబున ద్వాదశలక్షుల శుభ్రములకు భ్రమించి బొబ్బిలికోటం గొట్టి యారాచపట్టికిఁగట్టిపెట్టు గట్టిపట్టున నున్నవారు. మారాజెట్టి దుష్కార్యంబు నాజ్ఞోల్లంఘనంబును వారికిఁజేసియుండలేదు. రంగరాయ విజయరామరాజ క్షమావల్లభులకుఁ గల దీర్ఘవైషమ్యంబులు దమరెఱుంగనివిగావు. అట్టియెడ నవనీరుని వెనుక వైచుకొని నిర్నిమిత్తంబుగ నిట్టియపకృతిని మారాజునకొనరించి దుర్యశోపంకిలంబునఁ బడనుంకించుచున్నారు. ఇదియ వర్తమానము. మీతోఁజెప్పిరమ్మని రంగారావుగారు నన్నంపియున్నారు.

గోరు—ఆహా! (ముక్కుపై వ్రేలునుంచుకొని) ఏమిదురాగతము? ఆరాజు నీతురక్షయుంగలసి రావు కులాగ్రణియగు రంగరావుపై కరుగుచున్నారా? ఎంత్రపని! రెడ్డివరా!

గీ. బుస్సియేమయ్యె నిస్సిరో భూధవులకు
నిందుసఖ్యంబుఁ జేయఁగా నేర్పులేక
కొసరు విమతక్షమాధవుంగూడి రంగ
రావుపైఁబోవ నిదియేటి రాజనీతి? మఱియును

ఉ. మానితకీర్తివంతు లభిమానధనుల్ ధరరావువారు దు
ర్మానవమానభంజను లమానుషవిక్రము లట్టివారితో
నానెటి దండయాత్రల నొనర్చుట? సంధియెలెస్సగాని యు
ద్ధ్మానవనాథహైదరుల మాటలచే నటుచేయవచ్చునే?

రెడ్డి—మీరు సెలవిచ్చినది బహు న్యాయపథము. అయిన నారాజునకేమి కొదువ? అన్యులసొమ్ములకాసించి యాముసలిమానునకు మనంబునఁగినుక వొడమ నెట్లరికెనో గదా! ఆహా యేమి యాతనితెలివి? ఇంతేగాక.

గీ. విజయరామోర్విపునకెంత వెఱ్ఱిబుట్టెఁ
గొఱఁబిఁజేపట్టి తలగోకికొన్నరీతి
రావువారలతోఁబోరి రాజవంశ
మెల్లనడఁగింపనమకట్టె నెట్టివింత?

గోర — రెడ్డివరా ! వెనుక నీరంగరాయక్ష్మావల్లభుండును, విజయరామరాజుం దమ తమ వైరుధ్యంబుల నిచ్చటికివచ్చి నాకు నివేదింప వారికట్టివైరభావంబు తగదని వా రిన్నివారించి కినుకలనణంచి మృదూక్తుల వారింగారవించి యనిచినాఁడ. ఆరావు వారిమహిమ నేనెఱుంగుదు వా రభిమానధనులు, చావం జంప వెఱచువారు గారు. అధర్మయుద్ధంబులకుఁ బోరు సుమా !

రెడ్డి — ఘరాసువతంసమా ! సత్యము. నేనును వారిసంగతి నెఱింగినవాఁడనే. గర్వితా రాతివీరవార కంఠలుంఠన నిర్గళితకీలాల ప్రవాహ మజ్జన వ్రతాక్షీణదీక్షా పరాయణు లు రావువారు. వట్టివారా ?

గోర — రెడ్డిగారూ ! సత్యము వాక్రుచ్చితిరి. తమకావంతైన నపకారమెదఁ దలంచిన విమతులపైఁ దమదర్పంబులఁ జూపుటది యుత్తమమగు రాజనీతి. లోకు లితరేతర వైషమ్యంబులంబూని కలహించుచునెడ నడ్డమువచ్చి కాఁచుటలు క్షత్రియధర్మంబులు.

సీ. వీరిపోరాటమునకేమి కారణంబు ?
కలుగనేజూడు వారిద్దఱలమికలనఁ
బోరన్యాయంబు జయమందుఁ బుడమిలోన
వినమె "ధర్మోజయతి" యను వేదవాక్కు.

గీ. కాని బుస్సికి నిదియేటి మానితంపు
నడత ? యెన్నంగ విమతుని గడకుఁజేర్చి
విదితకకుబంత విశ్రాంత విమలకీర్తి
శాలితోఁ బోరసమకట్టె సాహసించి.

రెడ్డి — నిజము. దొరగారూ ! మీకుఁగోపమువచ్చునని జంకుచుంటినిగాని

గీ. తురకసరదారు లారయ దుర్మదు లిఁక
నర్థతృష్ణను నెవరిపైనైనఁగాని
కినుక వహియించి తెగువలఁ గొనఁగఁజూతు
రయ్య ! చనదిట్టి యాఱడి కియ్యకొనఁగ.

గోర — ఔనుగాని నేరమున్న నెట్టిశూరాత్మునైనను వంచనఁజేయుట ప్రఖ్యాతిగాని నిరపరాధులగు నీరావువారలతోఁ బోరుటెంతమాత్రము నీతియైనపని గాదు. అద టుండనిమ్ము.

గీ. రాచవారంప వెనుకీ పరాసువారు
రావువారిగడీమీఁద రభసమునను
నడచినారను దుష్కీర్తి వొడమకున్నె?
వారికే గాదు మాకునవారితముగ.

రెడ్డి—బాగుగ నాలోచించితిరి. అట్టి యపఖ్యాతి పుట్టకమానదు. జయించినను, జయింపకున్నను వారిశౌర్యగుణోపార్జితంబగు నఖండయశంబటుండనిమ్ము. నిష్కారణము పరాసులచేత నధర్మయుద్ధంబున నోడిరను నపఖ్యాతి మీకుఁ జెందనై యున్నది. యిది వారించుటే యుక్తము.

గోరు—ఏమి సేయను?

రెడ్డి—ఇట్లు చేయఁగూడదని సకారణంబుగ నొక జాబువ్రాసి బుస్సీకి నేరిచేతనైనం బంపుము. అది లెస్స.

గోరు—అట్లే యొనర్తును.

బుచ్చె—చక్కఁగఁజెప్పితివి. నేను గోరెడిదియు నంతియ.

గోరు—అటులైన వ్రాతుంగాక. (అనివ్రాసి ముగించి)
సేవకా! లూయిమర్టెనును బిలువనంపుము.

సేవ—చిత్తము. (అని పిలుచుకొని వచ్చుచున్నాఁడు)
(మర్టెన్ ప్రవేశించుచున్నాఁడు)

మర్టె—సలామ్ దేవరా! ఏమిసెలవు?

గోరు—మర్టెనూ! నీవేగి యీయుత్తరమును బుస్సీకిచ్చిరమ్ము తత్క్షణమపొమ్ము.

రెడ్డి—మహాప్రభూ! తమరు వ్రాసినదీవకీలుగారు వినెదరట చదివించెదరా!

గోరు—అట్లే చేయవచ్చును. మీరే చదివి వినుపింపుఁడు. (అని యిచ్చుచున్నాఁడు)

రెడ్డి—బుచ్చెన్నగారూ! చదువుచున్నాను వినుఁడు.

బుచ్చె—మంచిది. రెడ్డివర్యా! (సావధానముగ వినుచున్నాఁడు)

రెడ్డి—ఉత్తరము. దండకము:—శ్రీరస్తు. మాన్షీరు! బుస్సీ! వరా! మిత్ర! మీరా జమాబందిలోఁజేయు ప్రారంభముల్దేటతెల్లంబుగా వింటి. మాయావియౌ రాజు కొండెంబులంజెప్పి పండ్రెండు లక్షల్సమర్పింప మీమంత్రి హైదర్మదిన్సంతసంబందుచుంయుక్తియౌరీతి వ్రాకుచ్చి మీకెంతయున్నిక్క ఫుట్టంగఁ జేసెంగదా వార్పై రావువారింతయుఁ దోషముఁజేయలేదాయె ముస్నేష్టడా పూసపాట్యన్వయుల్

రావువారన్న లోవైరమే పూనియున్నారు. మీరాధరాధీశుతోఁ గూడుటల్లన్యా
యమే? రావువారెన్న సద్ధైర్యమంధాద్రు లక్లౌట వారిప్డు మిమ్మూరకేపోవనీ
రాజిఁకై పెచ్చు దుష్కీర్తి పాలౌదు మూరాజుతోఁగూడి విధ్వంసమున్జేసిరా సాల
ము౯ ఘాత్రింసువారన్నెకాంద్రించుఁదప్పున్న దండించుటల్యుక్తమే గాని నిర్దుష్టులౌ
వారితోఁబోరభావ్యంబుగాదెంచగాఁ జాలియుండేనిసఖ్యంబు గావింపుమా వారి
కి౯లేదా పోరంగనిష్మిద్దటి౯ ముష్మనూనాత్రిజులూహింప సద్ధర్మమున్వీడి రీపట్ల స
త్యంబుసుమ్మింతయు౯ వారుసెప్పంగ వింటేమియు౯ లెస్సగాదింకనీయుద్యమం
బాత్మఁద్రోయంగమేల్ వారలత్యంత రోషాగ్ని నేత్రుల్ ప్రతాపాగ్నిహోత్రుల్
స్ఫురద్దివ్యగాత్రుల్ జగద్వ్యాప్తకీర్తుల్ ప్రభామిత్రమూర్తుల్ భవత్ప్రేమపాత్రుల్
మదిన్నమ్ము.

మిక్లింతయున్వేడుచున్నట్టి,
మిత్రుండ,
గోరుందారి౯.

హాలుమకాము బందర్
* 7-1-1757.

బుస్సి—అంతే నాకుఁగావలసినది. బహుచక్కఁగనున్నది. రెడ్డివరా! ఆపైని దైవగ
తి యెట్లున్నదో యట్లుజరుగక మానదు.

గోరు—లాసూ! నీవీవకీలుతోఁబోయి బుస్సీగారికి దీనిజూపింపుము.

లాసు—స్వామీ! ఆజ్ఞఁగొనెదను. (అని వెళ్ళిపోవుచున్నాఁడు)

బుస్సి—(సెలవుఁగైకొని వానివెంటవే పోవుచున్నాఁడు)

రంగము:—ఖాసింకోట.

బుస్సీ కచేరీ.

బుస్సీ—మంత్రివరా! రాచకార్యములెట్లున్నవి? బొబ్బిలిరాజు పెద్దాపురమైన వచ్చి
యుండెనా?

హాయి—పరాసు వంశాగ్రిణీ! ఏలవచ్చును.

బుస్సి—భళీ! ఈమకాముననైనవచ్చునా?

హాయి—గీ. అట్టిసరసుఁడుగాఁడిప్పుడైన రాన
ధిపుడ! మన్నింప నర్హుఁడే తీవ్రరోష

* A probable date of the letter.

మేదను ఘటియించి రాఁడయ్యె మేదిని విభుఁ
డయ్యె! యిఁకనేమిసేయఁగానానాగాని.

బుస్సి—ఎంతపెంకివాఁడు రంగరావు ?

సేవ—స్వామీ! బందరునుంచి లాసూమర్టెక్ వచ్చె.

బుస్సీ—సేవకా! వెంటనే పిలువనంపుము.

సేవ— (పోయి వెంటఁబెట్టుకొని వచ్చుచున్నాఁడు)

(మర్టెక్, బుచ్చెన్న ప్రవేశంచుచున్నారు)

మర్టెక్—సలామ్ పరాసుకులావతంసా! బుచ్చెన్న. సలామ్ స్వామీ!

బుస్సీ—ఇటుకూర్చుండుఁడు.

మర్టెక్—బుచ్చెన నాసీనుంజేసి తానునుగూర్చుండుచున్నాఁడు.

బుస్సీ—మర్టెక్! గోరుందొరవారుసుఖులే ?

మర్టెక్—క్షేమము దొరగారూ!

బుస్సీ—నీరాకకుఁగతంబేమి ?

మర్టెక్—మీకిమ్మని గోరుదొరవారుజాబునిచ్చియున్నారు (ఇదిగోఅనియిచ్చుచున్నాఁడు)

బుస్సీ—తిరిగితిరిగి చదివి చూచుకొని.

గీ. ఎంతవాఁడవు హైదర యిట్లుచేయఁ
దగవె యీపట్ల? నమ్మంగఁడగునె నిన్ను?

హై—ఏమి యిట్లంటిరయ్య? నేనేమిజేసి
నాఁడ నపకార్యములువేగ నాడరయ్య

బుస్సీ—ఇంక నపకృత్యమేమనుచున్నావా? ఇప్పడొనరించినదికాదే?

హయి—ఖిన్నుండై తల వాంచుచున్నాఁడు.

బుస్సీ—మనస్నేహితుఁడును వయోబుద్ధి సామర్థ్యంబుల నెక్కుడవాఁడును ధైర్యమం దరుండునగు గోరుదొర వ్రాసిన జాబు వినుము.

(అని చదివి వినిపించుచున్నాఁడు)

హయి—(తనలో మాగుట్టుతెలిసినది. ఈపట్ల ధైర్యము వదలుట దగవుగాదు. అయిన దేమో యైనది. సమర్థించిగెల్చుట శక్తి. కానిమ్ము. నాతెల్వినంతయు నుపయోగిం చెదనుగాక).

బుస్సీ—ఛీ నీమాటవిని నేనుంజెడిపోతిని.

హాయి—అట్లు సెలవొసంగకుఁడు. తమకాగ్రహమువచ్చినది. ఇప్పుడేమియుననఁజనదు. నిజమువల్కిన నప్రియముగఁదోఁచు. ఆగ్రహస్వభావంబట్టిదియేకదా ?

బుస్సీ—ఇంకనేమి చెప్పవలసియున్నది ? తలఁచినదాని నిదివఱకే చెప్పియుంటివిగదా?

హాయి—క. నుడివితివేబద్ధుల ? నే
గడుసుఁదనంబలరఁ బనులఁగావించితినే ?
యొడయని యానతి లేనిది
బుడిబుడినన్నిట్లు పల్కఁబోలునె ? యధిపా !

అఖండధరాభారంబూని కార్యనిర్వాహకత్వంబున మీకావంతయు నొప్పిఁదగులనీక చిరకాలంబునుండి యమాత్యకృత్యంబు నిర్వర్తించుచుఁ దప్పన నేమి యెఱుంగక కాలంబుగడుపుచుంటింగదా ! నేటికిట్టిది పుట్టె.

బుస్సి—అపవాదము గలుగుకాలము సంభవించినది.

హాయి—బహుదూరంబునంగల గోరుందొరకే శ్రీకాకుళము వృత్తాంతము తెలియవచ్చినదఁట ! ఇచ్చటఁబనిసేయుచున్న మనమవ్యక్తులమఁట.

క. మనమొనరించెడుపనులకు
జనులాండ్లభ్యంతరముల సరవిని బెట్టన్
మనయధికారము చెల్లునె ?
జననాయక ! యగడుగాక జగతిని నెందున్.

బుస్సీ—అది నిజమేగాని రంగారావును మన్ననసేయుట యుక్తంబనియును విజయరామరాజుదితక్రోధబద్ధుండై యోర్వఁకఁ జేయు కుయుక్తి నీగదబుద్ధ్యదంబనియు మనకెట్టియుద్ధంబులఁ బ్రవర్తిల్లుట యపకీర్తియనియును వ్రాసియున్నాఁడుగదా. అతని హితోక్తి మెచ్చవచ్చు.

చ. హితుఁ డనుజన్మసన్నిభుఁ డహీనగుణార్జవకీర్తిశాలి సం
తతము మదీయగౌరవనిధానము కెట్టనుగోరు వాఁడిదో
హితమొనరించుటెంతయును హెచ్చటుచేయక యున్న నాపయిన్
మతినలుకల్గనించును సమాహితసైన్య విభుత్వవర్తికిన్.

హాయి—అట్లైనఁ దమయిష్టమువచ్చినట్లే చేయవచ్చును.

బుస్సీ—మనకిఁక బొబ్బిలికేగఁ బనిలేదు. శ్రీకాకుళము మీఁదుగ మనరాజధానిఁ జేరుదము.

హయి—గోరుదొర వ్రాసినంతమాత్రమున మనప్రయత్నంబు నూని పోవలసియున్నది అధికారుల యెడలఁ దాబేదారులొనరించు నక్రమంబులు సహింప మీరోర్తురుగాని మావంటి తురక బిడ్డలమోర్వఁజాలము.

బుస్సి—ఏమట్లంటిరి ?

హయి—గీ. ధీరులన్నను వారెపో ధీమసమున
ఖాన్నిఘాలను ఖాదరుఖైకొనకను
జంకుబొందరు మదిలోనఁబంకమూని
యట్లుజేయఁగలారె ? యేయన్యనృపులు ?

తెలియుచునేయుండఁగా వేఱుజెప్ప నేల ? జమాబందీకి రమ్మని యుత్తరువు జేయ లక్ష్యముచేయరైరి. పోనిమ్ము దివాణమువారిప్రాంతములకరుదెంచి చాలాకాలమైనను దర్శనమైనఁజేసిపోరైరి. వైగా మనమన్యాయము గావించుచుంటిమని బందరులోఁ బితూరీచేసిరి.

బుస్సి—అవును. నీవు నుడివినదియును సబబుగానే యున్నది.

హయి—గీ. రాజునేనును బహుళదుర్మార్గులమఁట
బొబ్బిలివిభుండుమాత్రమె బుద్ధిమంతుఁ
డఁట విశేషధనముగొని టక్కుమాటు
లాడు నారెడ్డి మాటలఁ బాడిగలదె ?

క. ఆరెడ్డినాయకుండిదె
యారంగారాయనృపతి యద్భుతగుణవి
స్తారుండని యెటుదెల్పెనొ ?
గోరుందొరగారితోడఁ గూరిమి పుట్టన్.

బుస్సి—ఆరెడ్డి లంచము దినెనేమి ? కనుకనే చక్కఁగనతుకునట్లు చెప్పి మనల నందఱిను దూలనాడించె. కాకున్న సర్వాధికారిని నేనుండ గోరుందొరకేమి ? శ్రీకాకుళము వ్యవహారమేమి ?

మట్టె—(బుస్సీచదువ నుత్తరమును సాంగముగవిన్నవాఁడేగాన సంగతినంతయుందెలిసి) తమ రట్లాలోచింపఁజనదు. ఈవిషయమై సైన్యాధ్యక్షునికందఱికంటె నెక్కుడు దెలియుననుటకు సందియమ్ములేదు.

హయి—ఎఱుఁగుదుననినం గాని మన నోరు మూయుటకవకాశముండదు. ఏమెఱుఁ

గుదురు? దేశముపై సర్వాధికారమూని వచ్చి పనిచేయుచున్న మాకింక నీ మనుష్యుల యానుపానులు బోధపడలేదుగాని సౌధాంతరంబున హుక్కా పీల్చుచుఁ బొర్రదులుంగక పోతుటీగకైనఁ జొరరాని పారాలోనుండి తనయొడలే తానెఱుంగని గోరుందొరగారికిఁ దెలియునఁట మనకుఁదెలియదఁట. ఎంతపిచ్చిమాట.

బుస్సీ—అవును. లాలోశీపసగానే కనుపించుచున్నది.

గీ. నిజము నీమాట హైదర! సేలమేఁడు
బహుళ దుర్వారగర్వ సంప్రాప్తవైర
భావమెదఁబూని యున్నాఁడు వానిగర్వ
మడఁపఁగావలె నెట్లైన నాఁగఁజనదు.

మర్ట్రె—పరాసువంశాగ్రణీ! మీధీసచివుని యాలోచన నీపట్ల వినఁబాడిగాదు.

హాయి—మీరెడ్డినాయకుఁడు మెచ్చకున్న మాకుఁజెడునదిలేదు.

మర్ట్రె—ఒకరికొక్కనివలనఁ గీర్త్యపకీర్తులు జెందఁగారణమగును.

హాయి—ఆలోచించి మాట్లాడుము లేకున్న నీగౌరవముంచువాఁడనుగాను.

మర్ట్రె—నీకేమి. యశంబపయశం బాయనివిగాని.

హాయి—ఎవ్వరికి నపకీర్తి జెందనీయకుండ నీవుంటివి చాలదూ?

మర్ట్రె—"అధికారాంతమునందుఁ జూడవలదా యాయయ్య సౌభాగ్యము" లన్నట్లిప్పుడు తెలియదు. తరువాత మీరేయనుభవింతురు. మేము పోయి వచ్చెదము బుస్సీ దొరగారూ!

బుస్సి—మంచిది.

(మర్ట్రెను, బుచ్చెన్న వెడలి నిజనివాసంబుల కరుగుచున్నారు)

హాయి—బుస్సీదొరగారూ!

క. మీకపకారముఁ దలఁతునె?
యాకాశ్యపినాథుచెయ్వు లవిసరియగునే?
యాకరము గొనరె దొర లిల
నీకైవడిఁబనులుసేయ నెచ్చటనైనన్?

ఆరాజాజ్ఞానర్చినది సరియేనా? మనకు వీరితోఁగల పనికై యెన్నిరోజులు కనిపెట్టుకొనియుండవలెను. మనయందింతపాటి గౌరవమైననుంచకున్న మన యుద్యోగములేల? తాఖీదునైనను లెక్కచెయ్యనిచోట నుద్యోగము చేయుటకంటె హైన్యములేదు.

సీ. ఛీ! నిఘాలేని నౌకరీ చేయుకంటె
నడుగు టదిమేలు చూడ నీయుర్వియందు
నధిపు గౌరవమొందని యపుడు కొల్వఁ
గొలుచుకంటెను మడిదున్నుకొనుట మేలు.

ఇదిగో మీమొహరు. నాకీయుద్యోగమక్కఱలేదు. (అనిబుస్సీకాళ్ళవద్దఁ బాఱ వే యుచున్నాఁడు)

బుస్సీ—సచివాగ్రణీ! తొందరపడకుము. గోరుదొరవారి ధోరణి నీతోఁజెప్పితిం గాని నీవు సేయుపని తప్పని యంటినా? నీయిష్టమువచ్చినట్లొనరింపుము

(సైనికులు ప్రవేశించుచున్నారు)

సైనికు—మహాప్రభూ! చచ్చిపోతిమి

హాయి—ఏమది? ఏమది?

సైని—మహారాజా! తమరంపఁగనేగి సమస్తముం గలయఁజూచుచుండ వారి ప్రదేశ మం దొండు వనంబునఁగొంతసేన హఠాత్తుగ మామీఁదఁబడి నలువదిమందిని హతు లంజేసె, కొంతమందికాయంబులు గాయంబులుగాఁగఁబలాయనులైరి, మిగిలినవా రలమీవార్త మీకుంజెప్పఁబఱతెంచి వచ్చినారము.

హాయి—దొరగారూ! చూచితిరిగదా యారాజుసేసినపని? సైనిక నికాయంబుల కాయంబులు గాయంబులుచేయుటయేగాక కొంతమంది ఫరాసులఁ బరాసులఁ జేసి రఁట సైఁచెదరా!

బుస్సీ—ఆవనమెవరిది?

హాయి—బొబ్బిలిరాజుది, సందియమేల? విజయరామరాజిట మనవద్దనే యుండియు న్నాఁడుగదా!

బుస్సీ—అబ్బా! ఎంతపని జరిగినది! నలువదిమందిని జంపించెఁగా! వీనిపొగరడఁ పవలసినదే, ఇఁకజాలిఁదలఁపరాదు,

హాయి—ఎంతక్రూరకార్యమొనరించెనో చూచితిరా?

బుస్సీ—అవును. ఇట్టిదుర్మార్గుని నేమిచేసినను జేయవచ్చును నేనుపోవుచున్నాఁడు.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

హాయి—సైనికులారా! నేనాసంగతిఁ గనుఁగొనెద. మీరు భీతిదక్కియుండుఁడు.

(సైనికులు నిష్క్రమించుచున్నారు)

సేవకు—స్వామీ! ఎవ్వరో తమదర్శనంబునకు వచ్చియున్నారు.

హాయి— (కోపముతో) రప్పింపుము.

(దమ్మన్న, వెంకయ్య ప్రవేశించుచున్నారు)

దమ్మన్న—వెంకయ్యా! ధూమ్రాక్ష, విరూపాక్షాది రాక్షస వీరాకృతిగల యీపాశ్చాత్యుండెగాఁబోలు హైదరుజంగు? ఊరకనే కన్నులనుండి క్రోధాగ్నికీలావిస్ఫులింగంబులెగయునిట్టి వీనితో నెట్లుపలికి సమాధానంబులఁ గొననగు?

వెంక—గీ. వీనిఁజూడంగ భయ ముద్భవిల్లుచునికి
యమునితో మాటలాడుట యని దలంతు
వీనితో నాడ నైనను వీఁడుమనల
నేమి సేయు నడుపుదము సామరీతి.

దమ్మన్న—కానిమ్ము. ముందు నేనే మాట్లాడెదను. సలామ్. సాహెబ్ మెహర్బాన్! బొబ్బిలినుంచివచ్చిన వకీళ్ళము. దమ్మన్న, వెంకయ్య యను పేర్లుగలవారము.

హాయి—మా సేనంజంపించెనుగా మీరాజు? జాగ్రత.

శా. ఏలాఱాఁడు భవత్ప్రభుండు మదిలో నేమంచు భావించెనో!
జ్వాలోత్తీక్షణ మత్ప్రతాపహుతభుక్చండస్ఫులింగార్భటిన్
ఖాలిచేయుచుఁగోటఁ బొమ్మనుచు మీఖామందుతోఁ దెల్పు పోః
వేళాకోళమె ఖాన్నిషూలిల హుసేన్వారాది సంబాధముల్.

దమ్మ—స్వామీ! కొంచెము శాంతింపుఁడు. తమ్ము నే దైవముగాఁ దలంచుచు రంగారావుగారు మీకెట్టియపకారమును జేసినవారుగారు, కోటవదలి వెళ్ళిపొమ్మను టేటి సబబు?

హాయి—ఎట్టిసబబా? కోటవెడలఁగొట్టి చెప్పెదను.

దమ్మ—అంతనేరమేమిచేసినాము? తురుష్కాగ్రణీ! తమదయకుఁ బాత్రులము.

హాయి—మాసైనికులఁజంపుటదేమి దురాగతము? (అని కత్తితో జళిపించుచున్నాఁడు.)

దమ్మ—గీ. ఇట్టిసని నెన్నఁడును జేసి యెఱుఁగమయ్య
వాదులాడుట మేలె మీపాదమాన
వైరిరా జిట్లుజేసి మావారిపైని
ద్రోసెనోగాని మీకిట్లు దోఁచెఁదగునె?

మీసైనికుల కంటఁజూడనైన లేదు. మారాజట్టితోవలఁబోవువాఁడుగాఁడు

హాయి—మేమా యట్టితోవలఁ బోవువారము ? (పండ్లుపటపటఁ గొరుకుచున్నాఁడు)

దమ్మ—గీ. నిరపరాధుల మమ్మిట్లు నిందపాలు
పఱుపఁగారాదు మీవంటివార లహిత
రాజువలుకులకలుకూని రాయిడించి
పక్షపాతంబు బూనుట పాటియగునె ?

హాయి—మాయాగ్రహము సంగతి నీకెందుకు ? మాయెడల సంతభయభక్తి యుక్తులుగాకి

దమ్మ—ఉ. రాదొకయింతయైన నపరాధము మీయెడనాచరింపఁగా
మీదగుదర్శనంబునకు మేకొని రానయియున్న యత్తఱిన్
మేదురవైరిభూమిపుఁడు మిమ్ములఁజేరిన దానఁజేసి కా
దే దురమావహిల్లునని దేవరఁజూడఁగరామి రావుకున్ ?

కాఁబట్టి మాయందట్టి తక్సీరు మాపుచేసి యెప్పటియట్ల బొబ్బిలిని రంగారావుగారికిఁ గవులు దయచేయింపుఁడు. ఇప్పుడ రంగారావుగారికి మీదర్శనంబునకు రాఁగ బురుపంపెద.

హాయి—ఏమీ ? అట్లయినంగాని రాఁడుగా ? మాయుమవలి మాతోఁ బోరఁగా నున్నాఁడు. మాకుఁదెలిసినది బహర్‌బిత్తర్ జల్లీల నెందు నిట్టిరాజునిం జూచియుండలేదు.

దమ్మ—అట్లుగాదు. మహాప్రభూ !

హాయి—గీ. మేము కౌలును వ్రాయము మీదొరయును
రానవసరంబులేదు. పోరయమెసంగఁ
బోలుపై ల్వెళ్ళి జాగాను బూటలోన
ఖాళిఁజేయింపుమని చెప్పు ఖండితముగ.

దమ్మ—ఎంతనుడివిన దాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్ళని చెప్పుచున్న నేమనఁగలవారము. మీయిష్టము వచ్చినట్లొనరింపుము.

హాయి—అట్లే జేసెదములే.

దమ్మ—మీకిట్టి దురాగ్రహవృత్తి మాయెడల నేల కలుగవలె ? స్వామీ !

హాయి—మీకీ వెంకిబుద్ధి యేలా ?

దమ్మ—మావల్లనొరంతయుఁ దప్పులేదు. ఖాన్ వర్యా.

హాయి—గీ. భూమిఖామందులము మేము పోటులాట
దగునెమాతోడ నిలఁగుత్తదారులకును ?

బుద్ధిహీనవుఁ బోకిళ్ళ బోవఁజనదు
గ్రుడ్డు పిల్లను భ్రమియింపఁగోరినట్లు.

గనుక తత్క్షణము బొబ్బిలివిడిచి లేచిపొమ్మని మీరాజుతోఁచెప్పు. పో.

వెంక—(తనలో) ఏమిది వీఁడు కోట విడిచి లేచిపొమ్మనును? (ప్రకాశముగా) త మకీ దురాగ్రహమేల? రమ్మని తెల్పెదు కొలుఁజూచినఁ దక్షణమే రాజు రానై యున్నాఁడు.

హయి—రానక్కఱలేదు. లేచిపోవునా లేదా?

వెంక—గీ. రావువారలతో మీకు రావుగలదె
యెప్పుడైనను? సాహేబ! యేటికింత
వింతకార్పణ్యమూన? మేమెంతవార
మయ్యమీరల్క చేసిన నాఁగఁగలము?

హయి—అవును. కార్పణ్యమే?

వెంక—క. నడిచితిమే దుష్పథముల
ముడిచితిమే పరధనముల మూర్ఖతతోడన్
విడిచితిమే నయగతులను
గడిచితిమే యాజ్ఞ తతులగంధము మీఱన్.

ప్రోలువిడనాడి పొమ్మను పేటి నడువడి తురుమాగ్రణీ?

హయి—గీ. తప్పుగల్గియు మఱుమాటఁ జెప్పఁదగునె?
రప్పనంగనురామి పరాసు పార
సీకు లెంతయు ద్రోహవిచింతనులని
చేరిబందరు చెప్పుటల్జేయుపనులె?

అన్నిటికంటె నెక్కుడుగ మాసైనికులఁజంపుటేల? చూడుమిన్నులనేమి సేతునో?

మీవిషయమై యింతయుఁ జాలిఁదలఁపరాదు.

వెంక—క. మీకపకారము గాదట
మా కుపకారంబుగాని మాన్యవర! మహా
నీకము నుజంపనెఱుఁగము
మీ కేటికిఁ గోప? మేల మిథ్యావాక్యాల్?

ఇవియా మీయాగ్రహకారణంబులు. ఎంత తప్పుజేసితిమి?

హాయి—వట్టి పరిహాసము చేయకుము. జాగ్రత. (అని కత్తితో జళిపించుచున్నాఁడు.)

వెంక—మీవంటి సాహేబుసుబాలవద్ద శేబాసు గేలుపొంది యుంటిమి. కాలుగావలె నన్నఁ గంటకమే ?

హాయి—అట్టివారైన నిట్టి యవ్యక్తులేలయ్యెదరు ? అందుకు మీరు దగరు. ఒక్కనిమిషమైనను మాపట్టణంబున నుండఁజనదు.

వెంక— క. మీరట్లువాంఛజేసితి
రా రాజును వీడిరండు రభసము మీఱన్
బోరామినేగెదము పాలు
పాఱన్ వసియింత్రుగాని హైదర! వీటన్.

హాయి—మమ్మాజ్ఞవెట్టు దార్ఢ్యముకూడఁ గలదా? నాయిచ్ఛవచ్చినట్లు చేసెద. అతనికే యిచ్చివేసెద. ఏమిసేతువో చూచెదను.

వెంక—“ మీరులేచి పొండి. మీవిరోధులను బ్రవేశపెట్టెద” నన్నమాట మీరనరానిది మావంటివారు వినరానిది.

హాయి—మీపౌరుషము తెలియ బోవుచున్నదిగా.

ఉ. చూచెదఁగాక మద్బలము చూళికలంగొని చెంపవేతలన్
బీఁచమడంచువేళ నిఁక పేలుటమానుము క్షితిదక్కియా
నీచుఁడు మాబలంబు గననేర్చునె దొండముగల్గినంత సం
కోచములేక నేనుఁగును గోడిగమాడెడి దంశమట్టులన్.

వెంక—ఉ. ఎంతబలంబుచేకురిన నెంతటి పౌరుషమున్నఁ గాలమ
త్యంతము చెంతదైనఁ గనఁబోలునె మీబలపౌరుషంబులున్?
దంతి యఖండవిక్రమము దార్కొనఁ గానఁ జరించుచుండఁగా
నంతమునందుఁ బట్టువడునొఁగద జాలరిపన్ను తాళ్ళకున్.

హాయి—ఏమాకాఋప్రేలాపన ? నోరుమూయింతుఁజుమీ నౌకర్. నికాల్.

వెంక—మాప్రాణంబులనైనఁ గోల్పోదుముగాని బొబ్బిలిమాత్రము విడువము. అన్యాయయుద్ధమునకు రాము. న్యాయయుద్ధంబునకు వెఱువము. ఇప్పుడు మీరు రణంబు దప్పదన్న వెనుకదీయము. దైవము వ్రాసిన రీతిగ జరుగఁగలదు. మీతోవాద మెందుకు ?

దమ్మ—ఖాన్ వర్యా! మేము చెప్పినదానిం దూరమాలోచింపుఁడు. చేయిజారినఁ జేయునది లేదు.

హుయి—అట్టిది మీరే యాలోచించుకొనుడు.

దమ్మ, వెంక—సెలవు గైకొనెదము. సాహేబుగారూ! సలామ్. (అని నిష్క్రమిం చుచున్నారు.)

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

రంగము:—బొబ్బిలి రాజు సభ.

రంగా—తమ్ముఁడా! వెంగళ్రాయఁడా! మనమా గోరుం దొరవారివద్దకంపిన బుచ్చెన్నగారు రాలేదా?

వెంగ—అగ్రజా! ఇదెవచ్చె.

బుచ్చె—మహాప్రభూ! తమరాకకై నిరీక్షించుచున్నాఁడ.

రంగా—మీరేగిన పనియేమైనది?

బుచ్చె—మహారాజా! పయనంబై పోవునాటి దినంబునఁ బెద్దాపురంబున విజయరామరాజుం జూచి ముచ్చటించితిని.

రంగా—ఏమని ముచ్చటించితివి?

బుచ్చె—గీ. మాటలాడితిఁ బ్రకృతోద్యమంబు సరణి
విముఖుఁడై రాజుగన్పట్టె వెల్లబాఱి
మనమున నసూయ యెంతయు మానుకొల్పి
నట్లుగని పెట్టిపోతి నేనలఘుగతిని.

రంగా—చూపోపమింజేసియే గాని యిట్టియధర్మంబున కొడిగట్టుకొనుటకుఁ గారణమేమి? అట్టివాఁడు భూతలంబున బాగుపడునె?

గీ. పూసపాట్యాసురాన్వయాంభోనిధిబడ
బానలనిభ విజయరామ పార్థివదశ
లపనుఁ డిలఁబరక్షేత్రాప్తి లంపముఁగనఁడె
రంగరాయని నిశితశస్త్రాళిఁ గలన?

తరువాత

బుచ్చె—దేవా! తరువాత నచ్చోటు వాసి ముసలమానుని చిత్తవృత్తి నరయఁగోరి రాజమహేంద్రవరపురంబుఁ బ్రవేశించి తురుష్క పరాసు దుష్టజనాభ్యంచిత సభాంతరంబున గుడమిళద్ధూమనిచయఫూత్కార వక్త్రసంగుండును, కాదంబరీ పానావేశ దురంతనితాంతాగ్రహారుణ కరాళ వదనోదిత గంభీర వాగ్నిర్ఘోష పరికంపిత సభ్యాంతరంగుండు నగు హైదరుజంగుం గాంచితి.

రంగా—వానితో ముచ్చటించితివా?

బుచ్చె—మనకును వారికిని బుత్రజనకభావంబుఁ గల్పించి యనేకభంగుల మనవలనఁ ద ప్పొకించుకైనను లేదని ప్రియవాక్కులఁ బ్రార్థనపూర్వకముగ మనవిచేసితినిగాని

గీ. రంగరావిష్టు మముఁజూడ రా నవసర
మెంతయును లేదు మేమయేలెంతుమటకు
నంచుఁ జెప్పెనుగాని యొకించుకైన
సంధిమార్గంబు నోటితో జారదయ్యె.

రంగా—అట్లనైనా? కానిమ్ము. తురకిల శౌర్యంబును రావువారి శౌర్యంబును జూ చునుగాక. తరువాత.

బుచ్చె—దేవా! నిజమార్గంబువట్టి కతిపయదివసంబులకు బందరు పట్టణంబునకుం బో యి చిరత్నరత్నసూత్న్యాయతనంబునఁ బేరోలగంబున్న గోరుందొరను జెంగటముచ్చ టించుచున్న మద్దాల రెడ్డినాయనిం గాంచితి.

రంగా—వారేమనిరి?

బుచ్చె—గీ. వారును మనపక్షమున నే వాదమొనరఁ
జేసి బహుభంగులను వారి సేఁతలుగ్గ
డించి యొకలేఖ వ్రాసిపంపించిరటకుఁ
గూర్మిమీఱంగ నిటుచేయఁగూడదనుచు.

ఆమర్రెనాహ్వాయనితో నేనుగూడ నరిగితి.

రంగా—ఆహా! నాయందలి వాత్సల్యత. గోరుందొరయంతపనిఁజేసెనేమి? బుచ్చెనా! నావిషయమై యెంతపనిఁజేసితివోయి. తరువాత నేమైనది?

బుచ్చె—వానివెంటఁగొని యెట్టకేలకు ఖాసింకోటఁబ్రవేశించి బుస్సీకిఁజూపింప

"గీ. దొసవు దొరలె నీకతనను దొరయఁజేయఁ
దగునె యెగ్గుల? నావెల్మ ధరణిపతికి
దొరకు దొరకొన దొరలకు దొరలు దొసఁగు
లనుచు హైదరుజా దూలంగనాడె దొరయు."

రంగా—తూలనాడఁడో? బుస్సీ యించుకేని నిరపరాధి. దీనికంతకుఁ గారణమా హైదరు. వీఁడు రాకున్నను బుస్సీ యీకొనకున్న నిట్టి కథకవసరమే లేదు గదా. తరువాత.

బుచ్చె—హైదరేమి విరుగుడులఁ గల్పించి వాఁడుచ్చెనోగాని బుస్సీ వానికెదురాడ లేకపోయె.

రంగా—ఇదంతయు నీనివలనఁ బుట్టినదేగదా. వాఁడు సౌఖ్యములఁబొందలనీఁడు.

గీ. రాజు దుర్బోధనలచేతఁ జాఁదుపారి
యెవరుచెప్పిన వినకుండె నెట్టిమూర్ఖు?
తొల్లి వినలేదె తురకలు దుష్టవర్త
నులను సామెత నల్కూట యిలవకేల!

బుచ్చె—అటుతరువాత మర్తైనాహ్వయుఁడును గొంతవడి ముచ్చటించెను గాని వినఁడాయె. ఇంకెందుకు? యుద్ధంబు కర్తవ్యంబు.

రంగా—పాపము నీవు వృథాప్రయాసము గల్పించితివే. ఈతురక సంధి పొసఁగనియ్యఁడని తెలిసియుండియు వెట్టిపాలైతిని. ఎట్లైనను సంధియగుడు భూజనులకు సౌఖ్యము గదా.

గీ. మేముమేమును బోరాడ మేదినిగల
ప్రజలకత్యంత మసుఖంబు ప్రాప్తమౌన
టంచుమదినెంచి సంధిపాటించినాను
గాని వినఁడయ్యెను మొఱకు కఱకు తురక.

బుచ్చె—ఇంతియ నావర్తమానము రాజేంద్రా!

రంగా—వెంకటాద్రియఁడా! ఏమి యీతురుష్కాగ్రణి దురాగతము? ఆబుస్సీ యెట్టి బుద్ధిహీనుఁడో.

గీ. గొప్పవారనుటేగాని గొప్పదొరలు
మంత్రులాడించు కీలుబొమ్మలు నిజంబు
నిజపరిజ్ఞాన శూన్యులై నెగడుకతన
వారిమహిమంబు భువి నేతిబీరకాయ.

వెంక—అన్నయ్యగారూ! అది నిజము. ఇంతేల? యుద్ధంబునకుఁ గాలు దువ్వుచు సంధిమాటలన్నఁ జెవిఁబెట్టక పరిపంథిరాజు దుర్బోధనా క్రోధావేశ పరవశత్వంబున మిన్ను మన్నెఱుంగక యాపరాసు రాయనైనం జేరికింగొనక పైపై రానెంచుచున్నాఁడు. మనము భయపడుదుమని యెంచెఁగాఁబోలు.

రంగా—బుస్సీ బుద్ధిమంతుఁడనియు స్వతంత్రశక్తియుక్తుండనియు నామది నెంతయునం
తసించితిని గాని హైదర్జంగాభిధేయ పాపిష్ఠ గ్రహావేశ శరీరుండౌట యెఱుంగను.
అట్టిది గాననే ఘురూపమానుండగు గోరుందొరను నిరాకరించి వాని మాటలఁ బెడ
చెవింబెట్టె.

వెంగ—క. ఎవరేవిధమునఁ జెప్పిన
నవునంచును దలను ద్రిప్పు నధిపతిగలుగన్
భువిజనులకెట్లు గల్గును
బ్రవిమల న్యాయంబు దీనిఁ బాటింపఁడొకో.

అయిన నిట్టినీతి యిక్కాలంబున నేదొరలయందుఁ గలదు. ఇప్పటి యధికారు లంద
ఱట్టివారే.

రంగా—గీ. న్యాయయుద్ధంబుచేకూర నదియులెస్స
వ్యాజహీనంబు కలహంబు ప్రాప్తమాట
యహితరాజందుఁ జేరి యప్రియములాడు
టయునుగూడంగ నెటువారి డాయనగును ?

వెంగ—అగ్రజా ! అయిన నేమి ? అన్యాయయుద్ధంబున దాజునకుఁ బరశు రాముఁడ
గ్నిహోత్రుఁడు శివుఁడు తోడ్పడనిమ్ము మనము యుద్ధముఁ జేయకుందుమే ?

రంగా—మాననేల ? అట్టియపఖ్యాతి వారినే చెందుఁగాక. కీర్తికామ్యంబులనొందనా
ర్యథనంబును దాచుకొందుమే ? గాని రాజన్నివిధంబుల సంపన్నుఁడై యున్న
వాఁడు.

వెంగ—శా. అన్నా ! యుద్ధమటన్న సందియము లేదావంతయున్వారి నం
పన్నాంధత్వము మత్ప్రతాపరవిరుగ్వ్యాప్తిం బటాపంచలై
బన్నంబొందదె ? ఘోరవీరరణభూభాగంబునం జైత్రరా
ట్సాన్నిధ్యంబునకంపనే రిపుల ? మత్సామర్థ్యమేపారఁగన్.

రంగా—అట్టిసందేహ మెంతయును లేదు.

వెంగ—కానిమ్ము దైవ మెట్లూహించెనో యట్లు జరుగకమానదు కానజరుగుదాని కో
పాటించుట మనపని. అనుమానించుట వెఱ్ఱి.

రంగా—అవును బాగుగఁజెప్పితివి. మనము దివాణమువారి కడకంపిన వకీళ్ళిద్దఱును
వచ్చియున్నారా మంత్రివరా ?

మంత్రి—వచ్చినారు రాజా !

దమ్మన్న—మహాప్రభూ ! వచ్చియున్నాము. తమసందేశమెను ఖానుతో వాక్రుచ్చినాము.

రంగా—వాఁడేమనె ?

దమ్మ—వాఁడెంతయు రోషభీషణ నేత్రాగ్నికీలల నేరినైనను దహించురీతిం గన్పట్టెన్.

రంగా—వాఁడట్లుంటకుఁ గారణమేమి ?

దమ్మ—గీ. వారిసైనికులిటకురా వైరమూని
యందుఁగొందఱ యమియించిరఁట యితరులఁ
గాయములు గాయములుపడఁ గాందిశీక
తనువెసం బాఱఁగా మీరుతరిమితిరఁట.

రగా—తమ్ముఁడా ! మంత్రులారా ! సభికులారా ! చూచితిరా ? ఈదుష్కృతము ను మనమెఱుఁగముగదా. ఇది మన విరోధి రాజు పన్నినపన్నాగముగాఁ దోఁచుచున్నది. ఆహా ! ఎంతకార్పణ్యము వహించియున్నాఁడు. మనభూమిలో జరిగినది గాన మనమే చేసినామని తలంచుటకు వీలుగనున్నది కదా.

వెంగ—వాఁడెన్నిటినైనం జేయును. మనమొనర్చితిమని వారితోఁ జెప్పును. మనమేమిచేయఁగలము ?

రంగా—వాఁడేమనె ?

ధమ్మ—క. అర్థాపేక్షను హైదరు
స్మర్థక్ప్రోల్వ్వడి మనలఁ జనుమనియెనుగా
వ్యర్థాలాపము లేటికి
సార్థకవాహులమె ? పోవఁ జయ్యన ననుజా !

రంగా—మనల బెదరించుటకు నిట్లాడుట వారికి నైజమే.

వెంగ—మనమట్లెంతయుం దలఁపఁగూడదు.

శా. అన్నా ! యెంతటివెఱ్ఱివాఁడవు. గడీనన్యాయమే వీడిపొ
మ్మన్నాఁడాతఁడు ఖానుఁడిష్టు మనలన్ మర్యాదలేకింతయున్
భిన్నంబౌగతి నెంచఁగూడదు సుమీ భీమాహవక్రీడకే
సన్నాహంబుదలంచె హైదరెద నిస్సందేహమే పాఱఁగాన్.

రంగా—కోరిన ధనమిత్తుమంటిమి. మనవలన నపరాధమేమి ? పిల్లల మేకలతోనున్న మనలను లేచిపొమ్మనుట మాటలా ? అట్టిపని వారేల చేయుమందురు ?

వెంగ—క. ఉత్తమధార్మికులగు మీ
రిత్తెఱఁగున నాచరింప నీకొనరు. కృపా
చిత్తుఁడగు హైదరిత్తఱి
నెత్తెఱఁగునఁ బాటిఁజేయు నీధర్మంబుల్.

వెంకయ్య—వెంగళ్రావుగారు సెలవిచ్చినది నిజము. మనము వేఱుగాఁ దలఁపఁగూడదు ఆఖానుండెన్ని మాటలఁ జెప్పిన యుద్ధమను మాటయేగాని సంధిమాట నొక్కటైన నుడువలేదు.

వెంగ—సోదరా! మీరింకను బెడత్రోవ సేయున్నారు.

మత్తకోకిల. వైరిభూపతి దుష్టవాక్తతి బాడబాగ్నిజనింప లోఁ
బారసీకపు సైన్యకంధియపారమై మనభూమి దు
ర్వారమాగతి ముంపవచ్చెడి రావువంశ్య భుజాబలో
ద్ధారుణీధరరాజినడ్డము దార్పనక్కరలేదొకో.

రంగా— మనమిప్పుడేమిచేయవలసియున్నది?

వెంగ—గీ. ఖానుద్రిమింగఁగవచ్చు స్వర్భానుపగిది
హైదరుగ్రుఁడై సంగ్రామ మోదమెసఁగ
నున్నవాఁడింకఁ దగుప్రయత్నోత్కరంబు
మెఱయ సిద్ధముగానుంట మేలు మనకు.

రంగా—ఎందుకైనను మంచిదే. తమ్ముఁడా! అలాగేచేయుదము.

వెంకయ్య—గీ. సమరమిఁకమీఁదఁ దప్పని సరియెగాన
రేకపల్లివనాళిలో రేపకడనె
వనజవదనల నభిమానధనల నెల్ల
దాచ మేలగునని యెంచెదను విభుండ.

వెంగ—గీ. అడవిపాలుసేయుటది యెంతయును గ్రూర
కర్మమెంచ వారుకడనులేని
దుఃఖమాత్మలోన దురటిల్లు మఱికొంత
యట్లుసేతకొప్ప నాత్మలోన.

రంగా—అరి రాజును వెంటఁగొని పరాసులతేఁడు మనపైఁగ్రుమ్మరునెడ మనము పాఱిపోయి దాగియుండుట మంచిపనియే? మేటిమగంటిమిగల పోటరులనేకులు మనకుండ నిట్టి భయహేల?

# శ్రీరంగారాయ కదన సమవాకారము

గీ. సమరమునఁబోరి యాసూర్యచంద్రముగ న
ఖండవిజయముఁ బొందుట ఖ్యాతిగాని
గత్వరంబగు ప్రాణముల్ గాచికొనఁగఁ
గాన దాగుట తగవేది ఖ్యాతియగునె ?

వెంగ—అన్నయ్యగారూ ! బాపురే ! బాగుగఁజెప్పితిరి.

మ. స్ర. వెంగళ్రాయోగ్రదోర్భృత్పృథులవిశిఖదర్వీకరంబాజిహైదర్
జంగాఖీలాయుధీయోచ్చయహృదయనభస్స్వాంతముల్ జగ్ధిగాఁగ౯
మ్రింగ౯ రంగప్రభుండు౯ ద్రిభువనములనిర్నిద్రశుంభత్ప్రతాపా
భంగశ్రీమించఁడే? నాబలము నెఱుఁగవే? చూపనున్నాఁడఁగాదే ?

పాపయ్య—నేనుండమీకెట్టిసంశయముగలుగఁగూడదు. ఏలనన

గీ. వైరిదుర్వారగాంభీర్యవారివాహ
పంక్తిఁజెల్లాకుచెదరుగాఁబాఱఁదోలు
తాంద్రపాపయ్యకల్పాంతఘార్ష్ట్యజంఝు
యబ్ధులనుదాటిమాయమౌనట్లుగాఁగ.

చె. వెం.—గీ. మున్నురాజాముకోటనుముట్టడింప
బాదుషాయంతవానినిబాఱఁదోలి
జయముచేకొంటిహాయిదరుజంగనంగ
ఖ్యాతియేనాకుఁ? గరము సంప్రీతి గాని.

దమ్మన్న—గీ. గోత్రనాయక ! దమ్మనగోత్రభిదుఁడు
గోత్రమరుదందదామెరగోత్రమఖిల
యశముబొందఁగ నిజశితాస్యశనిధార
శత్రుగోత్రాచలంబులశాత్రవమునఁ
జెండిచెండాడునుద్దండభండనమున.

రంగా—పోటిజోదులారా ! మీపరాక్రమముల వర్ణింపనలవిగాదు.

వెంగ—మీకుమేమందఱముకావలెనా? మీబలంబుమీ కెఱుంగరు. అనిమొనకుమీరొక్క
రేగిన రిపుసైన్యములు పంచబంగాళమై పారిపోవే?

రంగ—ఇట్టిదుర్గ మిట్టిసైన్య మిట్టి వీరులుఁ గలుగఁగనాకుభయమేల?

మత్తకోకిల. ప్రాణముండిననేలెదక్ భువిరాజ్యమెల్లనుభోరునక్
ప్రాణమేగిననేలెదక్ దివిరాజ్యమెల్లనుభోరునక్
జాణనైనకుటుంబినాచునుశాశ్వతంబగుకీర్తిచే
రాణువన్ననుజంకనేలదురంబుచేయఁగఁబోవుచుక్.

వెంగ—సోదరాగ్రణీ! నిజము. చావునకురెండుచావులుగలవా? జయాపజయంబులుదైవాధీనంబులు వారికెంతబలముండిననేమి?

రంగ—తమ్ముండా! సంధియొనగూడునేమోయని యాలోచించుచుంటినిగాని సంగ్రామంబునమకూడ వెనుకకడుగిడెదమా?

వెంగ—మీరుచెప్పినదే పౌరుషము.

రంగ—బంధువులారా! మిత్రులారా! మాతోపాటుయుద్ధముచేయ నిష్టమున్నరండు. లేకున్నమానుఁడు. ఏదోయొకవిధముగఁగృతనిశ్చయులరగుఁడు.

వెంగ—రాజా! మీరేసంగ్రామంబున కరుగనొకరింటివద్ద హాయిననుభవించువారలుగలరా?

వెంక—అందఱముమీవెంట నరుగుదెంచువారమేరాజేంద్రా.

రంగ—మంత్రివరా! అట్లయిన సంగ్రామసన్నద్ధులమైయుండవలయునుగదా! విజయరామరాజునకెదురొడ్డగు రాజాంకోటను ముందఁ సంరక్షింపవలసియున్నది. ఏమి మీయభిప్రాయము?

మంత్రి—నిజమురాజాగ్రణీ! రాజాముకోటబహుబలశాలి యురుబలంబుతో నుండవలసినస్థలము.

రంగ—ఎవ్వరినటకుఁబంపినబాగగు?

మంత్రి—మనతాండ్రపాపయ్యకంటె సమర్థులెవ్వరు స్వామీ!

రంగ—అవును. పాపయ్యా! మీరువెంటనేచతురంగబలసమన్వితులైచని రాజాఁకోటను సంరక్షించుచుండుఁడు. ఆకోటపోయిన మనసర్వమునుబోయినదేసుమా.

పాపయ్య—మహాప్రసాదము స్వామీ! పాపయ్యనారసింహమచ్చటఁ గావలియుండఁబెరజంతువుచ్చి ప్రాణముతోఁ బోవనేర్చునే? ఆకోటవూచీనాయది కాని యిక్కడబహు జాగ్రతతోనుండుఁడు. మఱియు.

గీ. మిమ్ము విడిచిపోవమేకొనకున్నది
నాడుడెందమహహ! నరవరాజ్ఞఁ

దెప్పినడచుటయునుదగవు గాదియ్యెడ
నేమి సేయువాఁడ నీశ్వరాజ్ఞ.

రంగా—పాపయ్యా! మాయందుఁగల ప్రేమాతిశయము కొలందిని మమ్ము విడనాడుటకు నీ మనసొల్లమి నే నెఱుంగుదు. ఆపనియైన నాదే గదా!

పాప—అయినను మిమ్ము వీడిపోవుటకు నాడెందంబు గడుఁ గుందుచున్నది, నామనంబునం గల విచారలహరి వెల్లువయై పాఱుచున్నది. నే నేగఁజాల.

(అని కంటఁదడి పెట్టుకొనుచున్నాఁడు)

గీ. ఇప్పు డేమమ్ము నెడబాప నెంచి లేకట
దైవమా! యెంత పాపిష్ఠి జీవినైతిఁ
బ్రాణములతోన రాజును బాయవలసెఁ
జేతనగు దానిఁ జేయలేనైతి నింక.

రంగా—ఏమి యీ వెఱ్ఱి పాపయ్యా! ఎందుకిట్టి సంతాపము. ఇప్పుడు నీకుఁ గల్గు భయమేమి?

శా. రంగారాయ నిశాతఖడ్గ మరివీరారణ్యము న్జెండ స
త్తుంగాభీలరిపుప్రతాపజలముగ్దుర్వారకల్పానిలా
భంగప్రౌఢిని మత్కరాసి మెఱయన్ బాపయ్య! నీకిప్పు డే
భంగిన్ జేకురు నయ్యయాపదలు? సద్భావంబుతో నుండుమా.

పాప—చిత్తము మీగంభీరవాక్కులచేఁ గొంత ధైర్యము గల్గుచున్నది. ఏమైన సరే. పోయి వచ్చెదను. (అని సేనతోఁ గదలిపోవుచున్నాఁడు)

రంగా—మంత్రివర్యా! భూనభోంతరాళంబులు భోరుకొల్పు ముసలిమానులొసంగిన మన నిశానీ నౌబత్తును బజాయింపుమని నియమింపుము. మఱియు మనగడీలంగము చుట్టును దగు సైన్యముల ఫారాయుంచి గస్తు తిరుగఁబంపుము. బురుజులపై మనశతఘ్నికానంతతిని గుదురుపఱుపుము. బిరుదువస్త్రాదులఁ గొందఱిని రాజాముదారిలో గొందఱిని గోటగుమ్మమువద్ద గొందఱిని బురుజులసన్నిధిని గొందఱిని బురీద్వారంబున నుండఁబంపుము.

మంత్రి—అట్లనే యొనర్చెదను రాజేంద్రా! (అని పోయి యట్లొనరించి వచ్చుచున్నాఁడు)

రంగా—శూరాగ్రేసరులగు దమ్మన్నప్రభృతి మిత్రవరులారా! మీరందఱును బాహువులను సారించుకొని జన్యంబునకో హటింపుఁడు.

దమ్మ—సిద్ధముగనున్నాము స్వామీ.

రంగా—సచివాగ్రణీ! తక్కిన సేనలకు యుద్ధంబు దెలిపి సిద్ధముగనుండఁబంపుము. పరశుపట్టెసముసలకుంతతోమరభిండివాల ముద్గరంబులకుఁ గరకువెట్టింపుము. బాణములఁ జికిలీచేయింపుము.

మంత్రి—మహాప్రసాదము భూవరా.

రంగా—శా. కల్పాంతోద్భవమేఘగర్జితమహాగాఢారవాఖీలమై
కల్పవ్యాకులరోదసీకుహరమై కాష్ఠేభబాధిర్యసం
కల్పానల్పసమర్థమై భయదమై ఘంటారవాక్రాంతమై
పొల్పొందన్ వినవచ్చెడిన్సచివ! యాభూరిస్వనంబేమొకో.

మంత్రి—ఆలకించుచున్నాఁడు (అందఱునద్భుతపడుచున్నారు)

(చారులుప్రవేశించుచున్నారు)

చారు—రాజేంద్రా పరాక్. రావువంశ క్షీర పారావార రాకా సుధాకరా! పరాక్. వార్ధిగంభీరా పరాక్. గోపాలకృష్ణ రంగారాయమహాప్రభూ పరాక్.

రంగా—ఏమిరావార్తలు?

చారు—పారసీకసైన్యమపారమైవచ్చుచుండఁగా నేమనియడుగుచున్నారా?

రంగా—వచ్చినదా? ఎచ్చటనున్నారురా?

చారు—వచ్చినదిస్వామీ ఇచ్చటికిక్రోశద్వయదూరమునున్న కాసారతీరంబున విడిసినారు.

రంగా—మంత్రిపుంగవా! మనమువిన్నధ్వనియిదేసుమా. ఏదోయనుకొంటిమి.

మంత్రి—వేఱేలగు? వారుయుద్ధముచేయగట్టితలంపునవచ్చినారు రాజా!

రంగా—చారులారా! వారిసేనను జూచితిరా?

చారు—మాఱువేషంబునఁబోయి చూచివచ్చినాము రాజేంద్రా.

రంగా—అద్దిరా! చారులారా! ఎంతపాటిది?

చారు—దేవా విజయరామరాజు సేన పదునొకండు వేలజోదులు.

రంగా—మంత్రివరా! చూచితే! మన సేనకు మూఁడురెట్లదేయున్నది.

మంత్రి—రాజేంద్రా! వీరందఱు సేవకులుగాని సైనికులుగారు సారములేనిది గంపెడేల?

రంగా—చారులారా! బుస్సీసైన్యమెంత.

చారు—రాజాగ్రణీ! ఇన్నూటయేబండ్రుగుఱ్ఱపురౌతులు నాలుగుఫిరంగులు, ఏడువందయేబదిమ్మంది లా, రాసు మొదలగు తెల్లవారును. బుస్సీసైన్యము మహాప్రభూ!

రంగా—అబ్బా! రిపుసైన్యార్ణవంబుదీర్ణంబై వెల్లువ్వెడిని. మంత్రి పుంగవా! మనసైన్యమెంత?

మంత్రి—రాజేంద్రా! మనబలము నాలుగువేలు మాత్రమే.

రంగా—ఈకొద్దిబలముచే రిపుల నోర్వఁగలమే?

మంత్రి—అదెంతపని? మనలో నొక్క శూరునికి వారందఱుఁ జాలుదురా?

రంగా—గీ. భారమంతయునిల్పి దైవంబునందె
గెల్చినను గెల్వకున్నను నిల్చియుండి
యాలమందున శత్రుల నోలమాన
గొనకపోరుటయే లెస్స కొంకులేక.

చారులారా! ఇంకను విశేషములేమి?

చారు—రాజేంద్రా! అచ్చట సేన విడియఁగానే మన నౌబత్ఖానా హైదర్జంగు కర్ణపుటభేదనంబుగావించినది.

రంగా—ఆపైని

చారు—ఆమీఁద హైదరుగ్రుఁడై విలయకాల రుద్రుని పగిది దండతాడిత మృత్యువుకరణి జగజ్జాలంబులొక్కుమ్మడిఁ గబళింపగమకించు కాళరాత్రివలె లేచి రోషభీషణానల కణంబులు నేత్రంబులఁ బొటపొటరాల రోషంబు గ్రక్కుచుఁ బండ్లు పటపట కొరుకుచు నొకరుతో నిట్లనె

రంగా—ఏమనెనో చెప్పుము.

చారు—గీ. "రణితభీషణ రోదోంతరాళకంబు
ప్రళయదిక్స్థాబ్ధి నిర్ఘోషవారకంబు
భీమవీరారి హృద్గ్రంధి భేదకంబు
భీమనాదంబు వినవచ్చుఁ బెలుచనెచట?" అని.

రంగా—నౌకరేమనె?

చారు—మహాప్రభూ! నౌకరా.

గీ. "అయ్య! సాహేబువర్య! మీరాలకించు
నాఘనాఘన భీమగర్జారవంబు
రణముసాగింప బొబ్బిలి రంగరాయ
ఘనుఁడు మ్రోగించు నౌబత్తునినద" మనియె.

రంగా—ఆపైని ఖానుండెట్లనె.

చారు—రాజేంద్రా! సేవకునితో నిట్లనె. "సాహేబు సుబా యిచ్చటకనతిదూరంబున దండు దిగియున్నాఁడు. నీవిట్లెంతయును భయంబులేక నౌబత్తును బజాయించుచున్నావు. ఈపని మాని వెంటనే కోటవిడిచి లేచిపోయెదవా? లేదా? లేని యెడల తేపుదయమున యుద్ధప్రారంభమగునని చెప్పు" మని పంపియున్నాఁడు.

రంగా—మంచిది. చారులారా! మీరు పోయిరండు. (చారులు నిష్క్రమించుచున్నారు)

(హసనల్లీఖానుఁడు ప్రవేశించుచున్నాఁడు)

హస—రాజేంద్రా! సలామ్. మాయేలికగు హైదరంపఁగా వచ్చిన హసనల్లీ యనువాఁడ.

రంగా—మిగులసంతసంబయ్యె. ఖానుఁడా! యిట్లుకూర్చుండుము. (అని కుర్చీయిచ్చుచున్నాఁడు)

హస—భూమివరా! క్షేమంబే?

రంగా—మీదయచే నింతవఱకు సేమమే.

హస—రాజా! మీవంటి యౌదార్యసద్గుణ గరిష్ఠుండు గలఁడె? మీప్రఖ్యాతి నేమువినుచుంటిమిగదా. అట్లనియెదరేల?

రంగా—మంచిది. ఖాన్వర్యా. నీరాకకుఁ గతంబేమి?

హస—భూకాంతా! మీరు మ్రోగింపఁజేయు నౌబత్తు మానినేయుమని బొబ్బిలివిడిచి లేచిపొమ్మని మీతో మా ఖామందు చెప్పుమనె. ఇదియ సందేశము.

రంగా—గీ. పాదుసాగారు మున్ను మాపౌరుషమ్ము
మెచ్చియిచ్చెను నౌబత్తుమేలవింప
దొంగతనముగ మ్రోగించుదుమె యిటాడఁ
దగునె నాగుమటంచీరు ధర్మమెఱియ?

ఇంతేగాక. బలవంతముగ నితరులందరిమి యీసాలంబుఁ బట్టికొనియుంటిమా? మా తాతముత్తాతలు మొదలీస్థలంబున బంధుమిత్రకళత్రంబులతోఁ గాపురములఁ జేయుచుంటిమిగాని నిన్ననేఁడువచ్చినారమా? వెళ్ళిపొమ్మనుటేటిన్యాయము?

హస—గీ. నిజమరి వినుఁగాని యిటుల నిజమరి యిపు
డెటుల విననేర్చు హైదరు చటులదురుప

దేశమును బొందె యీనుండె దేశికునకు
దేశరూపంబు వోనాడి దేశమెల్ల.

రాజు—ఖానువర్యా! వానిమాటలు విని యిట్లనుట తగునా?

హస—మాసైన్యములో ముప్పదిమందిని జంపితివని మిగుల రోషావేశపరవశుండై యున్నాఁడు. అదేమి?

రంగా—నిజము దైవమెఱుంగు. నీవెట్లనుకొన్నను సరే. ఆసంగతి నేనెఱుంగను.

హస—రాజా! అట్లే కావచ్చును. సముద్రమేఖలాపరీత భూమికధిపతియయ్యును దుర కబిష్ఠుఁడయ్యును నీవైరిరాజు కొండెములు విని నిప్పుద్రొక్కిన క్రోఁతివలె మండిపడుచున్నాఁడు. నేనేమిచెప్పినను వినఁడు.

రంగా—పంద్రెండులక్షల శుభ్రములు లంచము గొని కాకిని గొట్టి గెద్దకు వేయుట మంచిదియే?

హస—రాజా! ఆతురక యట్లుచేసెదనని కత్తిముట్టి సమయంబొనర్చెనఁట. ఎట్లు మానును?

రంగా—గీ. మమ్ము యుద్ధమందు మార్కొని జయమొంది
పురముచేకొనంగఁబోలుఁ గాని
తరమె పోరకుండఁ బురమును జేకొన
హరునికైన గోత్రహరునికైన?

హస—అదిన్యాయమే రాజేంద్రా! వలదని మేమెంతజెప్పినను వినఁడు

రంగా—పోనిమ్ము. వినకున్ననేమి? నలువదివేల సేన వారిది. నాలుగువేలు నాది. చూతువుగాని బలాబలంబులు పౌరుషాపౌరుషంబులు.

హస—రాజా! నామాట వినుము. ఎట్లైనను వారు దివాణమువారు. మీరుజమీందారులు. అధికారము వారిది. అహంకారము మీది. ఈపట్ల నామనవి వినఁదగు.

రంగా—అట్లంటివేని.

క. ఆరాజును నన్నిప్పుడు
పోరామి యొనర్పనిమ్ము పోడిమి మిగులన్
మారాజ్యము మాకొసఁగుము
మీరట్లానరింప మాకు మేలౌదవుఁగదా.

హస—అది నిజమే. అట్లీకొను నాధుఁడేఁడీ?

రంగా—అట్లుగాదేని !

గీ. జనులకెల్లనీతి సత్యమాడుటగాని
తురకదొరలనీతి దుడ్డెగాన
కొనుము వలయునంత కూర్పుము నాకిల
విజయరామరాజు వీడు ఖాన !

హస—ఇంతెందుకు. వాఁడట్టి నీతుల వినువాఁడుగాఁడు. నీవు వినినను వినకున్నను నేను జెప్పవలసినదానిం జెప్పెద. తురకననుకొంటివేమో జాతిందురకనుగాని మనస్సున నట్లుగాదు. పలువర్ణంబుల తెఱంగెఱుంగుదు. దయాసత్యశౌచంబుల హిందువులంబోలినవారు లేరు. అందులో బ్రాహ్మణు లగ్రగణ్యులు.

రంగా—చెప్పుము ఖాన్ వర్యా వినెదఁగాక.

హస—దండకము :—శ్రీరస్తు శ్రీరావు వంశాగ్రణీ ! రంగరాయక్షమావల్లభా ! సావధానుండవై విందువంచెంతయున్నమ్మదన్ గైకదుర్బోధచేఁ దండ్రిపంపంగ శ్రీరామచంద్రుండరణ్యస్థలిం బెక్కుకాలంబు కష్టంబులన్బొందఁడే ? ధార్తరాష్ట్రుండుగల్పింప నిక్కట్టులన్ బెక్కులంబొందఁడే ధర్మసూనుండు ఘోరాటవిందమ్ములంగూడి ? యయ్యో ! నలుండుగ్ర కాంతారసీమన్ బ్రియంబాసి దుర్బాధలంజెందఁడే ? గాధిసూనుండువెట్టన్ హరిశ్చంద్రభూపాలకుండొందఁడే చెట్టలన్ ? భూమిలో నెంతవారైన దుష్కాలమానన్నమా వేళఁ గష్టంబులం బొందఁగాలేదె ? తర్వాతసౌఖ్యంబులంజెందరే మంచిరోజుల్సమీపింప ? నారీతినే రాజచంద్రుండ ! యీదుష్టుఁడౌ ముస్లమాన్ ఖానుతోఁ బోరఁగా రాదు. ధర్మంబుశూన్యంబు నీతెన్నఁగా సున్న యేమంచుభావించితో ముస్లమాన్నీజనంబూతులన్ ? బ్రాహ్మణద్వేషమే ధర్మమన్యాంగనాసక్తియే యాత్మసంశుద్ధి యన్యాయమే నిష్ఠ దుర్వర్తనంబే తపం బెంచఁగా క్షోభమే నిత్య కర్మంబు సద్ధార్మికవ్రాతమున్గస్తిపాల్జేయుటే సద్వ్రతం బిష్టదైవస్తుతుల్ దుష్టభాషల్ గనన్ మ్లేచ్ఛగోత్రోద్భవశ్రేణికిన్ వారిలో ఖ్యాతిఁగన్నట్టి దుర్మార్గుఁడీమంత్రి యాదుష్టుతోఁబోరుటల్మానుటేయుక్తమౌ నిత్తఱిన్ బొబ్బిలిన్వీడి యెందేనిఁ గాలంబు సంప్రాప్తమౌదాఁక నుంటే కడున్ శ్రేయ మామీఁద మీయిష్టమౌనట్లు రాజ్యంబుసర్వంబు మీదౌను నిక్కంబు నామాటపాటింపుమీపట్ల రాజన్యచంద్రా ! యశస్సాంద్ర ! రంగాధిపేంద్రా ! జయమ్.

రంగా—ఆహా ! ఎట్టి సలహా జెప్పితివి ? అరాతిభూపతి స్వాపైదురంబున కరుదెంచు చుండ నన్నడపులఁ బ్రాణంబులు దాచుకొనుమనుచున్నావా ? ఇంతకంటె రావు వారికి దుష్కీర్తి కలదా ?

హస—అట్లైన మీయిష్టమట్లు మొనరింపుఁడు.

రంగా—క. ఇంతిమ్మని చెప్పిన ధన
మంతయును నీఁగలను విడువ మావాసపువీ
డంతయుని పురముజేరు ట
దెంతయును మేల్మారు బిరుదు నీఁగుటకంటెన్.

పోనిమ్ము శ్రీ శకమునందు బదునేడువందల యేఁబదియేడవ సంవత్సరమున జనవరి నెల నిరువదిమూఁడవదియగు నీదివసంబ నాయాయుష్కాలంబునకుఁదుది రోజని యనుకొనియెద. అర్థమింతైననిత్తు నక్కఱలేకున్నఁ బ్రాణముల విడుచువారమే కాని యిట్టిపౌరుష హీనంబులగు పనులొనర్చువారముగామని చెప్పుము ఇంత కంటె నేననవలసినదిలేదు.

హస—అట్లయిన రేపుదయమున నే యుద్ధము ప్రారంభమగునని హైదరు మీతోఁజెప్ప మనె. తయారుగనుండుము రాజా !

రంగా—మంచిది హసనల్లీఖానుఁడా ! మేమీరోజుననే నౌబత్తును మ్రోగింపఁజేయించు చుంటిమిగదా !

హస—రాజేంద్రా నేను బోయివచ్చెదను.

రంగా—మంచిది పోయిరమ్ము.

(హసనల్లీ నిష్క్రమించుచున్నాఁడు).

మంత్రివరా ! వింటివిగదా ? రేపుదయమున నేయుద్ధమారంభమగునని హసనల్లీచెప్పి పోయె మనమును దయారుగనుండవలెను సమస్తమును సిద్ధముగనుండెనా ?

మంత్రి—సర్వసిద్ధముగ నున్నది రాజా !

రంగా—అట్లయిన నేనుముందుగ సంగరంబునకేగెద మీరందఱును వేఁకువలేచిపోయి బురుజుల సంరక్షించుచుండుఁడు.

మంత్రి—ఆయేర్పాటంతయును జేసెదను స్వామీ !

రంగా—ఇప్పుడేబొబ్బిలిరాజ్యమున వెంగళ్రాయనికిఁ బట్టముగట్టి యుద్ధంబునకుఁ బో యెదను సఖా ! సమస్తమంగళ ద్రవ్యంబులఁదెప్పింపుము !

మంత్రి—జాగ్రత చేసెదను రాజేంద్రా! (అని సమస్తమును దెప్పించుచున్నాఁడు)

రంగా—వెంగళ్రాయని సింహాసనంబునందునిచి.

గీ. ధరణి నేలెద వాచంద్రతారకముగ
రిపులనోరిచి తమ్ముఁడా! విపులకీర్తి
నందుఁగావుత రావువంశాంబురాశి
నీదురాజత్వమహిమచే నిక్కువముగ.

(అని యాశీర్వదించి యక్షతలఁ జల్లుచున్నాఁడు).

వెంగ—(కన్నులనీరునిండ) అన్నగారూ! మీరిట్లేలచేసితిరి?

గీ. అన్న నీవిట్లు చేయుట యిదియమంగ
ళముగఁదోఁచెడి నాకిట్టిసమయమునకు
నీదుపజ్జసెవనుదెంతు నేనుగాని
రాజటంచును నన్విడరాదుసుమ్ము.

రంగా—తమ్ముఁడా! రాజుసంగరంబున కరుగుతఱి సింహాసనంబున నేరినైన నునిచి పోవలె. అట్టిదరాజ్యనీతి గనుక నిట్టులఁజేసినాఁడఁ గానిసంగ్రామ రంగంబున భంగంబునకు మదిఁగలంగి కాదుసుమీ.

వెంగ—అట్లయిన సరే. (అని కన్నీరు దుడుచుకొనుచున్నాఁడు)

రంగా—సేవకా! చినరంగారావు నిటుల నెత్తుకొని రమ్ము.

సేవకు—చిత్తము స్వామీ. (అని పోయి తీసికొనివచ్చుచున్నాఁడు)

రంగా— (పిల్లవాని నెత్తుకొని) తమ్ముఁడా వెంగళ్రాయఁడా! ఈపిల్లవానిని నీయధీనము సేయుచున్నవాఁడ. వీనిని నీయన్నగా భావింపుము.

వెంగ—దుఃఖమాపుకొనలేక దుఃఖించుచు.

గీ. అన్నగారని యాపిన్నయన్ననెంచ
నేల యన్నయ్య! నీకేమి యెగ్గుగలుగు
యుద్ధమందున? నట్లైన నుర్వియేల?
రాజ్యమేలయ్య? నాకిట్టి ప్రాణమేల?

రంగా—తమ్ముఁడా! సంగరంబున జయాపజయంబులు దైవాధీనంబులు గదా. ఎటువచ్చి యెటుబోవునో! గనుక యిట్లుచేసితి. విరుద్ధమేమి? అని

(వెంగళ్రాయనిపై మంగళాక్షతలఁ జల్లుచున్నాఁడు.)

మంత్రివరా ! నే నిదే యుద్ధమునకుఁ బోవుచున్నాఁడ.

(రంగారావుపై దేవతలు పుష్పవృష్టి గురియుచున్నారు)

ఆకాశవాణి— (శబాస్. భూమియందు రంగారావే వీరుఁడు. జగద్విశ్రాంత కీర్తిఁ బడయును గాఁత)

రంగా— బ్రాహ్మణుల కనేక దానంబులఁ జేయుచున్నాఁడు

(అందఱు నిష్క్రమించుచున్నారు)





# శ్రీరంగారాయకదన సమవాకారము.

## తృతీయాంకము.

విష్కంభము.

(నాగోజీరావు లక్ష్మన్న ప్రవేశించుచున్నారు,)

నాగో—లక్ష్మన్నగారూ! వింటిరా. రాత్రిసమాచారము? హుసనల్లీఖానుఁడు రంగారావు సన్నిధానంబున కేగి తనమాటలయందు నమ్మకముపుట్టించి తనపంపుఁజేయింప నెంచి యసంగతంబగు నాత్మీయ కులదూషణంబు నరాతి కులభూషణంబును గావించి నిజముట్టిపడునట్లునటించి బొబ్బిలివిడియేగుమని యనేకవిధంబులవాక్రువ్వ నారాజు కోట వదలనని సౌబత్తు మాననని యన్యాయంబుగఁ బైనెత్తివచ్చినఁ బ్రాణములైనఁ గోల్పోవ నిశ్చయించుకొన్నారమని వర్తమానమంపఁగ హైదరుగ్రుడ్డై విలయకాలదహనునిభంగి మండిపడుచు వారినీక్షణమునఁ బొబ్బిలిబైల్వెళ్ళఁగొట్టెదనని గగ్గోలు చేయుచుండఁగా నెంతధైర్యశాలియోగాని మన హుసనల్లీయెదుర్కొని హైదరుతో "ఇట్లునీతిలేక మాట్లాడుట న్యాయంబుగాదు. అడిగినంతపైకంబీయమని యనిరా? రావువారు దివాణముపై నయముదప్పి ప్రవర్తించిరా? రాజు దుర్బోధనచే మీరిట్టిదుర్నయమునకొడిగట్టికొనుట న్యాయంబుగాదు. రావువారభిమానధనులు. శౌర్యాన్వితులు. ఆపైని నిరపరాధులు. వారిపై నిష్కారణము దండెత్తుటలధికార మదోన్మత్తతావిశేషములు. గాని వేఱుగావు. తప్పులేనివారిపైఁదప్పు సంఘటించి సమరంబు చేయనెంచితిరి. వారెందఱిని మట్టుబెట్టెదరో యోచింపుఁడు. తాతలనాటినుండి గ్రామము వదలక కనిపెట్టుకొని శిశుబాలవృద్ధులతోఁ గాపురమున్న వారి కొంపలకగ్గిముట్టింప నెంచితిరిగదా! ఆపైని ఖుదా మిమ్మెట్లు చేయనున్నాఁడో? ఎదిరిచావును దమచావు నెఱుంగక పోరు రావువారల నెదుర్కొను వెట్టులుగలరా? ఆబుస్సీ యెట్లీకొనె. ఇప్పుడైన ధర్మంబుదప్పక నడచుట మంచిది. అడిగినంతధనము నిత్తుమనుచుండ వారిని జంపనుంకించుట మిక్కిలి పాపకృత్యము. ఆపాపము మనలఁ గట్టికుడుపకపోదు. న్యాయము చెప్పితిని. మీరేమి చేసినను సరే" యని యనేక విధంబుల నధికారియని యింతయుసందేహింపక మిగుల ధైర్యముతో వాక్రువ్వ వాఁడలిగి ఖానునిమాటలు లక్ష్యముచేయక వానిం జేయునదేమియు లేక

బుస్సీతో రహస్యమున ముచ్చటించి బొబ్బిలిరాజుపైఁ గొండెములు నూరిపోసి యె ట్టకేలకు యుద్ధమునకు సెలవిచ్చునట్లు చేసె. బుస్సీయు నుదయముననే సమరం బునకుఁగడంగుఁడని యాజ్ఞనొసఁగె. ఇదియనమాచారము. మనమును యుద్ధస న్నద్ధులమై పోవలెను. సద. సమస్తము దైవాధీనముగాని మనవలన నయ్యెడు నదేమియులేదు. కానిమ్మెట్లుజరుగునో చూతము.

(అని నిష్క్రమించుచున్నారు)

రంగము :—యుద్ధరంగము.

(ఉదయముననే యిరువాగుసేనలు నెదురుగ డాసికొనఁగా)

హైద—లాసూ! మీసైన్యముతోఁ బోయి బురుజుల స్వాధీనము చేసికొనుము. వీర భటులారా! మీధైర్యంబులఁజూపుటకిదే సమయము.

భటు—ఖాఁవర్యా! మాకు రంగారావన నెంతటివాఁడు? ఇదేపోవుచున్నాము.

రంగా—వెంగళ్రాయఁడా! మీరందఱెచ్చటనున్నారు?

వెంగ—మహాప్రభూ! మేము తక్కిన మూఁడు బురుజులమీఁద నున్నారము కొంత మంది కోటక్రింద సమరంబునకుఁ దూగియున్నారు.

రంగా—మంచిది జాగ్రతగ నుండుఁడు.

(రణభేరి మ్రోగుచున్నది. యుద్ధమారంభించుట. ఘంటానాదముప్రవర్తించుచున్నది)

(రంగారావు లాడమూఖానుల యుద్ధము)

లాడమూ—ఓరీ! మాతో నేలబోరెదవురా? ప్రాణములపై యాశలేదా? నీవా మ మ్ములను గెల్చువాఁడవు?

రంగా—శా. ఓరీ మూఢుఁడ! క్రూరచిత్త! విను జన్యోర్వీస్థలిన్ బోరి నీ
దారాపుత్రులు శోకమంద మడియందర్పించుచున్నావు రం
గారాయోగ్ర నిశాతమార్గణ భుజంగంబేచ్చి యుగ్రాకృతిన్
గోరల్గీరుచునున్న దిప్పుడిటగో గ్రోలున్ భవత్ప్రాణముల్.

లాడు—వట్టిదంభములనేల ప్రేలెదవురా? చూతువుగాని నాశక్తి.

(అని తుపాకీ కాల్చుచున్నాఁడు)

రంగా—తప్పించుకొని వానిపై బాణవృష్టిఁ గురియించుచున్నాఁడు.

(లాడమూ మృతి. పారసీక సేనాకలకలము)

సైని—(ఇద్దరు వద్దికిఁబోయి) మహాప్రభూ! మన లాడుఖానుండు రంగరాయని

నిశితబాణపరంపరల కోర్వఁజాలక కాలధర్మంబునొందె. తత్సైనికనికాయంబును గాందిశీకులై పాఱిరి. ఏమిసెలవు ?

హైద—గీ. ఊడెఁగాలాడు ! రంగరాయోగ్రనిహతి
లాసూ ! నీవేగి తక్షణంబ రిపులనోర్చి విజయంబుఁ జేకూర్పుము.
నీవుగలుగఁగ నాకిల నిర్భయంబు
మున్ను జరిగినయుద్ధములలో నీవలననేకదా మాకుజయంబు చేకూరె.
రంగరావెంత నీకుసంగ్రామ సీమ
జయముగైకొనిరమ్ము నీజవము మెఱయ.

లాసూ—అదెంతపని ? స్వామీ ! చూడుము నాబలము. (అనిపోపుట)

(రంగరాయ లాసూఖానుల యుద్ధము.)

లాసూ—గీ. లాడుఁజంపితి నంచు నీవాడఁబోరు
షంబె ? నన్నెల్వ మింక నీశక్తిఁదెలియు.

రంగా—గంతుగొనియెదు నాకాండ కాండములను
నిల్చిపోరుము నాతోడ నిముష మిచట.

లాసూ—ఓరిరాజన్యాధమా ! ఏమీ డంబములురా ! ఏదీ ! నిలువఁబడితి. చూపుము నీశక్తి ?

రంగా—ఓరీ పారసీకాధమా ! నీకుఁ గాలావసానంబగుటనే నాతోయుద్ధంబు సంభవమైనది. ఇదెకాచుకొనుము (అని బాణమును వదలుచున్నాఁడు)

లాసూ—సైనికులారా ! బురుజెక్కుఁడు. ఎక్కుఁడు. ఇదేసమయము. పైనుంచి యీరాజాధముఁ డపరిమిత కాండములనేయుచున్నాఁడు. ఎక్కినంగాని వీనిమట్టుపెట్టఁజాలము.

సైనికు—ఎక్కుచున్నాము. ఎక్కుచున్నాము. (అని యెగఁబ్రాకుచున్నారు)

(రంగారావు బాణములచేఁ గొందఱు నేలఁ గూలుచున్నారు)

లాసూ ! ఎక్కడనున్నావు ? నీవెక్కవేమి ?

లాసూ—ఇదే నేనును వచ్చుచున్నాఁడ. (అని సైనికుని భుజములపైఁ గాల్మోపిచి యెక్కుచు రంగారావు బాణహతిచే నేలఁగూలుచున్నాఁడు.)

సైని—(హాహాకారంబులు సెలంగ హాయిదరుంజేరి)
సాహెబా ! సైన్యమంతయు నంతంబునొందె. లాసు గతాసుండయ్యె. ఇంకేమి

సేయుదుమయ్య ?

హుయి—ఓహో సుకురల్లీఖాన్ ! సిద్దిబిలాల్ ! జానుఖాన్ ! హుసనల్లీ ఖాన్ !
ఏలచూచెదరు ? ఇందూలాసులను మట్టుపెట్టి రంగారావుక్కడ మిగిలియున్నాడట
తక్షణము మీరేగి యాశూరుని బరిమార్చిరండు.

సుకు—తమసెలవుకొఱకు నిరీక్షించుచుంటిమిగాని యిదెంతపని ?

(అని రంగారావునెదుర్కొనుచున్నాఁడు)

రంగా—గీ. ఓరి ! నెయ్యురలాడుఖానాళిఁగూడఁ
బోవనున్నాఁడవే ? భళి ! నీవస్నేహి
తుండవన్నఁగో నిస్తురదుర మదీయ
యాజివంజవ బాణౌఘు మనుచు నటకు.

ఇదేమదీయాతుగము బ్రవర్తిల్లెడిని. (అని వదలుచున్నాఁడు)

సుకు—ఇందూలాసూలనుకొంటివేమో కాదు సుమా. నేను సుకురల్లీఖానును జాగ్రత్త

(అనియొక తుపాకీని గాల్చుచున్నాఁడు)

రంగా—(తప్పించుకొని మూఁడుబాణముల నేయుచున్నాఁడు)

సుకు—బిలాల్ ! రా. జానూ ! ఎక్కడవేమి ? హుసనల్లీ ! చూచెదవేల ?

జానూ—ఎక్కుచున్నాము. గాని.

క. సైనుండి దేహమెంటియుఁగఁ
గోణంబుననిల్చి రాజు కోపోద్దీప్తిన్
బాణానలంబు గురియుఁగఁ
బ్రాణంబులఁ జిక్కబట్టి ప్రాకఁగ నెట్లా ?

ఖాన్ ! ఏమూనో ఎక్కివచ్చుచున్నాము.

రంగా—ఉగ్రుండై (తనలో) ఆహా ! వీరు బురుజులపై నెక్కుచున్నారు.

శా. ఓరీ ! మిమ్ములనెక్కనిత్తునె ? గడీ నోహో ! యముంజేరి మీ
మీ రాలాసములుగ్గడించి వరము ల్వే పొందిరం డిమ్ములన్

(అనుచు నిస్త్రింశోత్రయమూకొని వారివెడందయురంబులపై గురికొనియేయ నేల
గూలుచు)

బిలాల్—ఓరంగావనిభర్త ! చంపితివె మమ్ము న్గ్రాతుగౌఘుంబుచే
దారాపుత్రులకేదిదిక్కిఁక ఖుదా ! ఘాతేయి నల్లానబీ.

(అని ప్రాణములు వదలుచున్నాఁడు. ఈకేకలువిని సైనికులొక్కుమ్మడిఁ దెగువఁ దెచ్చుకొని పైకెగఁ బ్రాకుచున్నారు)

బుస్సీ—యోధవీరులారా ! ఘటికాద్వితయంబు కాలంబు సమరంబుచాలింపుఁడు.

(అందఱు నాయుధములు నేలవైచి శ్రమలఁ దీర్చుకొనుచున్నారు)

రంగా—(తొందరతో) ఆహా! నలుమొగంబులం దురకలు దండోపదండంబులుగ నెగఁబ్రాకి పైకెక్కుచున్నారు. అదె కొంతసైన్యమిదివఱకె యెక్కివచ్చె. ఓహో వెంకయ్యగారూ ! వెంగళ్రాయఁడా! దమ్మన్నగారూ! ఎక్కడనున్నారు? వేగ యిటురండు.

వెంక—చిత్తమేమి సెలవు? అందఱమిక్కడనే యున్నాము.

రంగ—వీరు లగ్గలకెగఁబ్రాకిరి. వీరినాంచుట శక్యముగాఁ గన్పించుటలేదు. అందఱు నెక్కిరా కోటఁదీసికొన్నవారే. కోటపోయెనా వైరిరాజు దుర్వృత్తివల్లనైననేమి మఱేకారణమువల్లనైననేమి స్త్రీల నవమానపఱతురు. గనుక

గీ. ప్రాణములకంటె నెక్కుడు పౌరుషంబు
గాన శుద్ధాంతకాంతల మానుషమ్ము
నిల్వఁగాసాధనంబీరు నేర్పుమీఱఁ
జెప్పుఁడిప్పుడలేకున్నఁ జేటుబుట్టు.

వెంగ—అన్నా! మునుమున్న వారియభిప్రాయంబెఱింగి తదనుకూలముగఁ బ్రవర్తిల్లుట మనకావశ్యకమైయుండ నిప్పుడాలోచనకేమున్నది.

గీ. సంభవించెనుమనలకు సంఘమరణ
కాలమిప్పుడు శంకింప నేలయన్న!

రంగ—సత్యమదితమ్ముఁడా! యింక సంశయింప
నేల కృత నిశ్చయుఁడనైతి నిఁకనేను.

చెలికాని వెంకయ్యా! కోటబురుజులపై వేనవేలు యవనులు ప్రాకసీకఁలెక్కి, నాదిక్కున కదెవచ్చుచున్నారటు జూడుము. మనము యుద్ధము తిరిగి ప్రారంభము సేయునంతలో వీరందఱును బైకివచ్చెదరు గాన నీవుతక్షణంబేగి శుద్ధాంతకాంతల సబంధుమిత్రంబుగ శిశుబాలవృద్ధులతోఁ గరవాల నికృత్త కంఠల నొనర్చి వేగ రమ్ము. ఆలోచించినం బ్రయోజనము లేదు. త్వరగాఁబొమ్ము. ఆలోచింపకుము.

వెంక—కత్తిదీసికొని పరుగెత్తుచున్న సమయంబున సైన్యభూమి కంపమొందుచున్నది. తారలు డుల్లి నేలవ్రాలుచున్నవి. (తనలో) ఆహా! దైవమా! ఎట్టిపాపిష్ఠ జన్మ మెత్తితిని? ఎట్టిపాపకృత్యము నావంతు జేసితివి? పురాకృతంబున నెట్టి దుష్కృతం బొనర్చితినోగదా! కేవలము కటికివానిపనికంటె నెక్కుడు పాపకార్య మొనర్పవలసి వచ్చినదే? ఇట్టిపనికి ముజ్జగంబులఁ దగినవారు లేక నన్నారసితివా?

శా. ఆహా! దైవమ? యెట్లుచంపుదును నేనంతఃపురస్త్రీతతిన్
బాహాసిన్ హరిణాంక బింబముఖులన్ బద్ధాత్మతుష్టులన్ బాపము
త్సాహంబెంతయు మీఱనుండు నజపోత వ్రాతముంబోలె స
ద్గేహంబందున నుండువారి కెటులన్ గీడెంతు నే నక్కటా!

గీ. ఆడువారిని జంపుట కూడదంచుఁ
దెలిసి యపకృత్యమున్ జేయవలసె నాకు.
నిట్టిపాపిష్ఠ కార్యంబు నెఱపు కొఱకె
జన్మమెత్తితిఁగాఁబోలు జగతియందు.

ఇందుకై సిద్ధముగానున్న యీబాహువును ఖండించుకొనిన బాగుగనుండును.
(అని తెగవేసికొనఁ బోవుచున్నాఁడు).

కంచుకి—(చేయి బట్టుకొని) వలదు. వలదు. ధైర్యమూనుము. (అనియాపుచున్నాఁడు)

వెంక—ఛీ! భార్యయనక బిడ్డలనక రాణియనక వృద్ధులనక యందఱిని జంపుట కెట్లు చేయివచ్చును? హా! దైవమా!

ఉ. ఎంతటినాఁడ వైననగు దీవిదె దైవమ! నీదుచేతలున్
వింతలు ముజ్జగంబున దివిన్ భువి నీతలక్రిందు సేయు సా
మంతము మెచ్చవచ్చును సుమా యపరాధము లేని వెల్మస్త్రీ
సంతులఁ జెట్టుకాయవడి ద్రుంచెదునట్టులఁ జేయ నెంచితే?

అనుచుఁ బరుగెత్తి దూరమున మల్లమ్మాదేవింజూచి

ఉ. మల్లమదేవి! సర్వజనమాన్య చరిత్రి! సుశీల! సాధ్వి! సం
సల్లలితాంగి! దీనజన పాలక కల్పకవల్లి! లోకులన్
జల్లని చూపుచూచు విలసత్కృప గల్గినతల్లి! నీక య
బ్బెల్ల! పొసంగుటెట్టి దురవస్థ? యిదెక్కడి కర్మమక్కటా!

(అని గోలుగోలునయేడ్చుచు వెంకయ్య మల్లమ్మాదేవి చెంతకరుగుచున్నాఁడు)

రంగము :—రాణివాసము.

(మల్లమ్మాదేవి కూర్చుండియుండఁగా వెంకయ్యయేడ్చుచుఁ బ్రవేశించుచున్నాఁడు)

*మల్లమ్మ—వెంకయ్యా! నీవువచ్చినపని నాకుఁదెలిసినది. చెడువార్తలు చెవినిబడకుం డఁగనే నీకత్తి నాచేతికొక్కసారి యిమ్ము. (అని లాగిపుచ్చుకొని చెంతనున్నదాదింజూచి) దాయీ! నీవీపిల్లవానిం గొంపోయి సామర్లకోటలోఁ బినతల్లివద్ద దిగ విడిచి రమ్ము. (పిల్లవానింజూచి)

హా ముద్దులకుట్టా! చిన్ననాటినుండి యింతవఱకు నాచనుబాలఁ బెరిగితివి. ఇంక నీకుఁ బాలియ్యనోచనైతినా తండ్రీ? నీజనకుండు రణరంగంబునంగల్గిన యధైర్యముచేత శుద్ధాంతకాంతావ్రజంబు నాబాలగోపాలమ్మును జంపుమని యిదే పంపియున్నాఁడు. అమానుషముకంటె నిదేమంచిది. కాని

శా. కట్టా! ముద్దులపట్టి! చెట్ట చెడుగుల్గానంగలేకున్నని
న్నెట్టీ పట్టునడించిపోయెదను? నీకేదిక్కు? ఇంకెవ్వ రి
క్కట్టుల్ ద్రోయుదు? రేమిసేయుదు? నిదేకర్మంబొ నీపాలికిన్
బుట్టెన్ దైవముకంటికింతబరువైపోతే కుమారోత్తమా?

ఇంకను యువరాజ్య పట్టాభిషేకముఁ బొందెదవు. బొబ్బిలినేలెదవనుకొంటింగాని దాదికినొప్పగించి ప్రాణముల దక్కింతునని యనుకొనలేదు. హాపుత్రా! నాభాగ్యరాశీ!

ఉ. తెక్కలురావు. ఆకలినెఱింగెడివాఁడవుగావు. మిక్కిలిన్
బొక్కెదు తల్లియొక్కక్షణముస్లనిపింపనిపట్ల. బిడ్డ! యిం
కొక్కెడఁబాలుద్రావ, వెటులుండెద, వెవ్వరుపెంచువారు, ని
న్నక్కట దిక్కుమాలిన దురాగతుఁజేసెనె? దైవమిత్తఱిన్.

హా ముద్దులకుమారా! తల్లిలేక యెంతయేడ్చెదవో. పాలులేక యెంతపొగిలెదవో. హా కుమారా! ఈశ్వరుఁడు నీయెడల నెంతదారుణము వహించెనురా! కన్నబిడ్డా! చిన్నిపుత్రా! చినరంగరాయా!

ఉ. చిన్నికుమార! వెల్మకులశేఖర! యోచినరంగరాయ! మా
యన్న! యనుంగుఁగుట్ట! లసదానన నిర్జితచంద్రబింబ! వి

* The Ghosha of Mallamma Devi should strictly be observed by placing a screen in front of her so that her person alone may not be seen by the audience.

ప్రసన్నత ధైర్యధుర్య! సముదారగుణోదయ! తండ్రి! యేలరా!
చిన్నతనంబునందె పలుచిక్కుల పాలయిపోతి వయ్యయో.

నావంటి నిర్భాగ్యురాలికి నిన్నుఁజూచి యానందించు భాగ్యమెక్కడిది? దిక్కుమాలిన పక్షినైతినే? (అని పలుమాఱు మూర్ధాఘ్రాణ మొనర్చుచు)

ఉ. మామక శత్రుసంతతి యమానుషము న్గని చావబుద్ధియా
నీమొగము న్గనుంగొనిన నిక్కము చావఁగబుద్ధిపుట్ట దిం
కేమి యొనర్చువాఁడ విధి యెట్టులఁజేయఁగనున్నవాఁడొ? నిన్
భూమిని నొంటిగావిడిచి పోవుచునుంటివిబుత్ర! నిర్దయన్.

కుమారా! చినరంగరాయా! తండ్రిశౌర్యము నిలువఁబెట్టుము. తొల్లి శ్రీరామచంద్రుండడవికిఁ జనుచున్న తఱిఁ గౌసల్యామహాదేవి తనతనయునకిచ్చిన దీవనలే నీకగుఁగాత. తొల్లి తల్లిచెరఁబాపనమృతంబునకై మాహేంద్రపట్టణంబునకుఁ జనునప్పుడు వైనతేయునకు వినతామహాదేవి యొసంగిన వరములే నీకును మేలొనగూర్చుఁగాక. సవతితల్లిచేఁ బెక్కుకట్టులంబడి ధ్రువుండడవికిఁ జనుతఱిఁ దల్లి యాబాలున కిచ్చిన యాశీర్వచనములే నిన్నోముఁగాక. సూర్యచంద్రాది గ్రహంబులు భూగగనంబులు త్రికాల సంధ్యలు త్రిమూర్తులు నిన్నాచంద్రార్కము రక్షింతురుగాక. ఇంకొకసారి ముద్దిమ్ము హా తనయా! హాకోటిసూర్యప్రకాశా! హాసుకుమారా! హాబొబ్బిలిశౌర్యాకారా! హాపసిబిడ్డా!

ఉ. కాలెముప్రోయుఁగావశమె? కన్నులనిండఁగఁగన్నబిడ్డ! నీ
మేలును గాంచి మోదమునమించెడిప్రాప్తము లేదు నా కిఁకన్
బాలక! చాలవృద్ధిగని పౌరుషకీర్తులఁజెంది లోకమున్
బాలనఁజేయు మనయునఁ బ్రస్తుతిసేయుఁగఁబెట్టకాలమున్.

హా! కుమారా! (అని గోలుగోలున నేడ్చుచు ధైర్యము తెచ్చుకొని) దాయీ యీపిల్లవానిని క్షేమముగఁగొనిపోయి యొప్పగించిరమ్ము. వెంకయ్యా! నీకాలస్యమగుచున్నదా? (మోమువంచుకొని యేడ్చుచున్న వెంకయ్యంజూచి) బొబ్బిలిబెబ్బులి యింతవఱకు సేమంబుగ నున్నవాఁడా?

వెంక—ఏడ్చుచు క్షేమముగనున్నాఁడు తల్లీ!

మల్లమ్మ—అట్లయిన బహుధన్యురాలను. అతివలకు భూతలంబున భర్తృవియోగంబుకంటెదైన్యమును బతిబ్రదికియున్నఁ సంభవించుమరణంబుకంటెభాగ్యమునులేదు. పురాకృత

జన్మసుకృత పరిపాకంబునంగాని పుణ్యస్త్రీమరణంబుసంభవింపదు. చిరకాలము కలియుగదేవేంద్రుఁడైన రంగారాయోర్వీపతికి భార్యనైయుండి వీరబొబ్బిలికిరాణినై మల్లమ్మాదేవియనిఖ్యాతినొంది తుదకు శత్రురాజుల యవమానుషంబునకులోనుగాక చెడుమాట చెవినిబడకుండ నాభర్త చిరాయుష్యాకాముఁడైయుండ నేనుముందుగా స్వర్గపథంబువట్టి పోవుటకంటె సుకృతంబేమిగలదు ? వెంకయ్యా ! నీకాలస్యమగుచున్నదా ? సూర్యచంద్రాదిగ్రహంబులారా ! అష్టదిక్పాలులారా ! జాయాసహిత త్రిమూర్తులారా ! బొబ్బిలిపురీవాసా ! యీశా ! ఈదివసంబున వీరబొబ్బిలి రాణియగు మల్లమ్మాదేవి విజయరామరాజు తురకలంగూడి యొనర్చునవమానుషంబునకు వెఱచి నిశితకరవాలధారచే ప్రాణంబులఁ దొఱంగుచున్నది.

ఉ. ఏను బలివ్రతామణినయేని ధరాసురభక్తిలోనఁ బెం
పూనితినేని సచ్చరిత నొంది చరించితినేని నావిభుం
డేనయశౌర్యశాలియగునేని దురాగతి మెంచినట్టి దు
ర్మానితుఁడైన యావిజయరామునివంశము భ్రంశ మొందుతన్.

అనిపాడుచుకొని భూమిపై నొరుగుచున్నది.

(ఆకాశవాణి) " ఇమ్మహాపీరపతివ్రతాశాపంబున నట్లకాఁగలదు. ఆధాత్రీకళత్రుండు సపుత్రమిత్ర కళత్రంబుగ మల్లమ్మాదేవి శాపవశంబున మూఁడవదినంబున గంతుగొనఁగలవాఁడు. (ఘోరమగు కలకల్లము) *

వెంక—(తక్కినవారినిజూచి) అయ్యో ! పెనుభూతమువలె నన్నెట్లుచూచుచున్నారు! (వడంకుచు నేడ్చుచున్నవారినిజూచి) హాదైవమా !

ఉ. మాటలురానిపిల్లలను మాటికిలేవఁగలేని పెద్దలన్
నీటులుమీటుబోటులను నిక్కపుఁబోటరిబోలెఁజంపనే
నేటికిఁబుట్టినాఁడనొకొ యీశ్వర ! యక్కటికంబులేక మె
ప్పాటున మేకలన్ గటికివాఁడుదలల్దునుమాడుకైవడిన్.

మత్తకోకిల. తప్పునేయ రెదుర్ప రెవ్వరి దౌష్ట్యమింతయుఁజూప రొ
క్కప్పుడేనియుఁ బిల్లదంబులనాడఁబోవరు వీరి నే

---

* The screen to be removed covering the corpse of the Queen with a cloth.

నిష్ఠుఁడెట్టులఁ జంపఁబోవుదు నీశ్వరా! యిదియంతయున్
ముప్పుఁదెచ్చె సహానుభంపడి పోదుమంచను బుద్ధియే.

భార్యయుఁ బిడ్డలును వగఁగూరి నిశ్చేతనులై యుండ

గీ. ప్రాణనాయక! నాముద్దుబాలలార!
నేటితోఁ దీరె మీఋణం బేటికింక

హా! సఖీమణీ! హితనయులారా! చిరకాలమునుండి మీతోడఁగలసి మెలసి మెలంగిన ప్రేమానుబంధము నిదె నిర్దయుఁడను ఖడ్గధారఁ గఠినహృదయుఁడనై తెగవ్రేయుచున్నాఁడ. నాకంటెఁ గ్రూరతముఁడుండునా? హాతరుణీమణీ! పుత్రులారా!

ఇట్టిగతిమీకువచ్చునంచెప్పుడేని
స్వప్నమందైనఁ దెలియఁగఁజాలనైతి.

(అని యందఱిని దెగవ్రేయుచున్నాఁడు) తరువాత మూర్ఛిల్లి కొంతవడికిఁదెలిసి హా! మల్లమాంబదేవీ! ప్రతివ్రతాశిరోమణీ! నీవేయంతశయ్యాపాలుగాఁగ మేమందఱ మెందుకు? అంత వీరబొబ్బిలికి రాణివైయుండి ప్రాణములం దావంతమైన నాసఁజేయక కత్తిపాలైతివే! తల్లీ! నీకేమిదురవస్థ తటస్థమైనది? దైవమెంతయు నీయైశ్వర్యముంజూచి యోర్వలేకపోయెనే? నిన్నటిరోజునఁ గలకలనాడు బొబ్బిలిసాలంబు నీనిమేషంబున నిర్మానుష్యంబగు శ్మశానవాటికగా మార్చివేసితివే. నీకెట్టియపకారంబొనర్చితిమి దైవమా? హాప్రారబ్ధమా! ఎంతసేసితివి? ఛీ! నాబ్రతుకుకాల్పనే! పుత్రమిత్రకళత్రబంధు వర్గంబు, నందఱికంటె నెక్కుడుగ రాణిని నాశంబునొందించి యీజన్మమును గాపాడుకొననా? (అని తెగవేసికొనఁబోఁగా)

నౌకరు—అయ్యా! వెంకయ్యగారూ! రంగారావుగారు తక్షణమ మిముఁ దీసికొనిరమ్మనె వేగరండు.

వెంక—అయ్యారె! అచ్చట నేమివింతలు బొంతమయ్యెనో? పోయి రాజునకీవధప్రకారంబు సెప్పిమఱి చచ్చెదను గాక. (అని రాజువద్దకుఁ బోవుచున్నాఁడు)

రంగా—పనిజరిగినదా?

వెంక—(కన్నుల నీరునిండ) అయినదిరాజా!

రంగ—హా దేవీ! హా! తనయా!

చ. అనికరుదెంచువేళ మిమునందఱఁజూచినదెంతొగాని నేఁ
గనుఁగొననోచనైతిఁగద కన్నులనిండఁగ, నిన్ను! హా! ప్రియా

మణి! మురిపెంపురాణి! సుకుమార! కుమార! యింకేమి సేతు? నే మనియనువాఁడ? దైవగతి, యక్కట! యెంతటిపాట్లుగల్గెనో!

బుస్సీ—యుద్ధము ప్రారంభము సేయుట కపవాదమొసంగుచున్నాఁడః

(అని భేరీమ్రోగింపఁ జేయుచున్నాఁడు. అందఱును సంగరంబునకుఁ గడఁగుచు న్నారు.

అల్లీఖాన్—సుగంధి. చాలు, చాలు, బీరమింక శాత్రవప్రతాపముల్
డీలుసేయఁజాలువాఁడ డీకొనుండుమమ్ములన్
గేలిగాదు పోరిలోనఁగెలుకొన్ననైపుణిన్
గాలుద్రువ్వియేయుచుంటిఁ గాచికొండుప్రాణముల్.

(అని యనేకుల సైనికులంగూడి శతఘ్నికాసంతతిం బఱపుచున్నాఁడు)

రంగా—(విచారమును దిగమ్రింగి ధైర్యముతెచ్చుకొని క్రోధావేశుండై రెట్టించినశౌర్యంబు మైఁగ్రాల) ఓదుష్టులారా! చండాలులారా! మీపిరంగులరంగులు నేనెఱుంగుదు. నన్నేమియుంజేయఁజాలవురా! నాబాణములఁ గాచికొండు. (అని యంపవానఁ గురియించుచున్నాఁడు)

జంద్రాల్—హుస్సేనూ! ప్రళయకాలరుద్రునివలె యవనఫ్రాసీకసైన్యముల నొక్కపెల్లునమ్రింగవచ్చు మహాశక్తివలె నీతురష్కఫరాసు వరూధినీమహారణ్యంబును గాల్ప ననేకజిహ్వాలతోవచ్చు దావానలంబుకరణి నీరంగరాయండొప్పారెడి. వీనితోమనము గెల్వఁగలమా? పోరకుంటిమా హయిదరుచేతిలోఁజావవలె. అంతకంటెనిదేమేలు. రంగరాయఁడా! ఏల ప్రాణంబులఁ గోల్పోయెదవు? మాశక్తి యెఱిఁగియుండియు నిట్టివెట్టిపాలేలయ్యెదు. ఇప్పుడైన మాకేనిశరణువేడుము. అట్లయిన మేలగు.

రంగా—వట్టిబీరముల నేలపల్కెదవురా! ఇదె నాయాశుగంబు నీశరీరంబుఁదెగ్రొవ్వ నేయుచున్నది. (అని వదలుచున్నాఁడు)

జంద్రా—(తప్పించుకొని) అల్లీఖానుఁడా! రాజుకోటపైనుండి బాణాసారంబుగురియ మనవరాసులు పరాసులై నేలఁగూలుచున్నారు. మనమెన్నిపిరంగులఁ బఱపినను వానినింతైన గాసిచేయవుకదా! కానిమ్ము మనమందఱము బురుజులపై కెక్కవలె. (అని యెక్కుచున్నారు)

రంగా—వారియుత్తమాంగంబులపై గురివెట్టి హరులం బఱప జంద్రాల్ నేలఁగూలుచున్నాఁడు.

హుస్సేన్—ఔరా! రాజాధమా! నికారణంబుగా వించితివిగదా! ఇఁకఁజూడుము నాశక్తి. నిన్నింతవఱకుఁ జులుకనగా భావించుచుంటిని. ఇప్పుడనిన్ను యమసన్నిధానంబున కంపుచున్నాఁడ.

రంగా—ఓరీ. నిన్నుఁ దావాసనంబు గావించినంగాని నేనేగనురా.

(అని యమ్ములవాన గురియింప)

హుస్సేన్—(క్రిందఁబడుచు)

శా. ఓహో సైనికులార! కూలితిని మీరుద్వేగులైపీనితో
బాహాబాహినిబోరిపట్టుఁడితనిన్ బంధించి హింసింపుఁడో
హో హో హైదర! దుష్టవర్తనుఁడ నీహోదా మముఁ జంపెరా
ఛీ! హీనప్రభుఁగొల్చువారికరుదే చెట్టల్ ధరిత్రీస్థలిన్?

సైనికులు—(ఆమాటలువిని ధైర్యస్థైర్యంబు లినుమడింపఁ దెగువఁదెచ్చుకొని వేనవేలభీ యాలి వీరవరులు నద్గళప్రజ్ఞావిశేషంబున నొక్కుమ్మడి బురుజులపైకి నలుప్రక్కలనుండియెక్కి సంకులసమరంబుగావించి “పట్టుఁడు! పట్టుఁడు కొట్టుఁ” డంచు బీరంబువక్కుచు రంగారావుంబొదివిరి.

రంగా—ఓహో తమ్ముఁడా! వెంకటాద్రియుఁడా! ఎచ్చటనున్నావు. వేగరా!

(అని కేకవేయుచున్నాఁడు)

సైనికు—(ఇంతలో రంగారావును వధియించుచున్నాఁడు.)

(సేనాకలకలము. హాహాకారంబులెసంగుచున్నవి)

బుస్సీ—సైనికులారా! ఇరుదెసఁగులవారు నీరోజు యుద్ధంబు చాలింపుఁడు సాయంత్రమైనది. (అందఱు నాగుచున్నారు.)

వెంక—(సైనికులవలన రంగరావు తెఱంగెఱింగినవాఁడై పరుగెత్తుచువచ్చి)

శా. అన్నా! పోవుచునుంటివేదివికి? నన్నా! తమ్ముఁడాయంచునీ
వన్నా! సోదరుఁబిల్చుచుంటివె? తగన్ వార్రుచ్చి పోవంగనా?

(అని యన్నశరీరంబుజేరి సోదరుఁడు దివికేగెననికృతనిశ్చయుండై)

అన్నా! రంగనృపాలశేఖర! ధరిత్ర్యాఖండలా! శౌర్యసం
పన్నా! యమ్ములనీడిపోయితివె! భూపా! రంగరాయాగ్రజా?

శా. అన్నా! మొన్నఁడొ వైరులంగెలిచి పీవత్యున్నతిన్ బొబ్బిలిన్
జెన్నారంగనుగన్నులారఁగనఁనేఁజేతో ముదంబందఁగా

నున్నాఁడట్టి రణరంగమందుఁబడఁగా నున్నాఁడ వంచెన్న లే
దన్నా! భారవి! యస్తమించితివె? వప్రాస్తాద్రిపై నగ్రజా!

శా. అన్నా! సోదరవత్సలా! పురుషసింహా! ధైర్యమంధాద్రి! యో
పున్నాగా! శతభాస్కరాభ! ధరణీభూభృజ్జయా! యిస్సిరో
యన్నా! యెంతటి భాగ్యహీనుఁడను నేనన్నన్న! నానోటితో
నన్నాయంచును బిల్వనోచనయితిన్ హా రంగరాయాగ్రజా!

(అన్న శరీరముపై బ్రాలి)

గీ. అస్తమించెను బొబ్బిలి యస్తమించె
నవని శూరత్వమంతయు నస్తమించె
నపుర వెలమకులంబెల్ల నస్తమింప
రావురంగావనీ నుండు ప్రతిభఁ దక్కె.

సోదరా! యీయటమట కాఁడు చేయఁబూనిన విప్రలంభమునకు వెఱచి యీలువు గోల్పోవుకించ చేఁదూపిల్లి గోడాడి ప్రాణంబులఁదొఱంగిన నీప్రియామణి మాకు రాణి యగు సాధ్వియందుఁగల మోహంబు విడనాఁడఁజాలక యన్యాయయుద్ధంబున మెలంగుతలంపుఁజాలించి దివంబున కరిగితివే! మమ్మేమిమొనర్చిపోతివి? నీవులేని బొబ్బిలి చంద్రుఁడులేని రాత్రి. జ్వాలలేని యగ్ని. జలంబులేని కాసారంబును. గదా! నీమృత్యువునిని నలుదెఱంగులఁ బోరుచున్న యోధవరులెల్లరు నిఁక నేరికై పోరవలెనని నిజకరపరికర కరవాలంబుల నసురులఁ దొఱంగుచున్నారు. వీరిని జూడుము. అయ్యో! చూడలేవా?

(అనియేడ్చుచు)

గీ. పవిత్రుఁడెన్నంగఁదాఁగర్మసాక్షియయ్యు
నాజిలో నీవు రంగరాయాగ్రజన్మ!
తఱుగఁజూడఁగ లేక నో చరమగిరికి
నరుగుచున్నాఁడు కాఁబోలు ఖరకిరణుఁడు.

(అని దుఃఖించుచున్నాఁడు)

దమ్మన్న—(చూచి) వెంగళ్రావుగారూ!

గీ. మీరె ధైర్యంబు వదలిన మీఁది కార్య
మెట్లు నెఱవేరుఁ గష్టముల్ మించుతఱిన
ధైర్యము న్వీడకుండుట కేతగవు సుమిత్ర
లవినఁగాలేదె? సాహసేలక్ష్మియనఁగ.

తమవంటి ప్రతాపశాలులే యిట్లు వెఱ్ఱిచింతపాలౌట యుచితమా ?

వెంగ—(విచారించుచు) దమ్మన్నగారూ! నిజదారాపుత్రాదులు నశించినను సోదరుండు సజీవుండైనచో నాకువిచారములేదు. అట్టియనుజన్ముండు తరుగఁగ నెంతకఠిన హృదయుండనోగాని ప్రాణముల విడువఁజాలనైతి.

దమ్మ—అయ్యా! ఇప్పట్ల ధైర్యమువదలుట పనిగాదు. మేమందఱమింకను బ్రతికియుండ మీకువిచారమేల? ఎట్లయిన నాయశ్రియాతివర్గంబు నొంచుట పౌరుషంబుగాని యీరీతిం ధైర్యంబువోనాడుట కూడునే ?

వెంగ—క. జగదేకవీరుఁడంచును
జగతినిబ్రఖ్యాతిఁగన్న చటులోత్తేజుం
డగు సోదరుఁడే గతియిం
పఁగ నేటికి భూమినాకు? భాగ్యమదేలా?

(అనివెండియు దుఃఖించుచున్నాఁడు

ధర్మారా—ఊరడిల్లుమురాజా! విచారించినఁ బ్రయోజనమేమి ?

వెంగ—(కొంతవడికి ధైర్యముఁదెచ్చుకొని) అవును. దుఃఖించి యన్నను దేఁగలనా? అయినదానిగుఱించి చింతించుటేల? నాశక్తికొలఁదిని బోరెదనుగాక. మీరందఱును మీమీధైర్యంబుల నినుమడించికొని యెదిరింపుఁడు. దైవవంచనకు మనమేమిసేయఁగలము?

దమ్మ—అదియ పౌరుషము. రంగరాయగారు కాలధర్మమునొందిరిగాన గెలిచితిమని విజయరామరాజును హయిదరును విఱ్ఱవీగుచున్నారు. వారిపొగ రణంచి విఖ్యాతిఁగాంచుఁడు.

వెంగ—అటులనా నేనున్నానని యనుకొనలేదా ?

మ. అలఁతిఁ బోఁవఁగనిత్తునే రిపుల? నన్యాయంబుగానగ్రజుఁ
బొలియింపఁ బగఁదీర్పనే? వెఱతునే బోరంగ? భీతిల్లిబొ
బ్బిలికోటఁ విడనాడియేగెదనె? మద్వీర్యాతిరేకంబు వ
ర్తిలనాజిఁ విమతాళిఁగూల్పనిది యుర్విఁ బౌరుషంబేతగఁ ?

దమ్మ—భళి! నీదేపౌరుషము. అపరశురామునిదే పౌరుషము. ఉభయసైన్యములును గోటబురుజులపైని యుండుటంబట్టి బాణయుద్ధం బసంగతంబు. తూణీరకోదండ

కాండంబుల నొక్కెడ గుప్తంబుగావింతము. అగ్నియంత్రశస్త్రాధారంబుగ నెదిరింతము. కాకున్న సంకులసమరంబు దప్పదు.

వెంగ—అట్లనే తోచుచున్నది. దమ్మన్నగారూ! కుక్కుటంబులు దిక్కులు పిక్కటిలురవంబున మొరయుచుండుట విన నిశాంతంబగునట్లు తోచెడిని.

ధర్మ—రాజువెడలం బుండరీకంబులు తేజోవిరాజమానంబులగుచు యుండరీకంబులు కాండనిధులనిండె సజ్జనకార్యంబులకుఁదోడ్పాటువడుట మిత్రకృత్యంబనుకరణిఁ బ్రభాకరుండు పూర్వాశాభాగంబునఁ జేజరిల్లె. మనమింక జన్యంబున కుద్యమించుట కర్తవ్యంబు. (అదె బుస్సీవచ్చుచున్నాఁడు)

బుస్సీ—యోధవీరులారా! యుద్ధంబు ప్రారంభముఁజేయుఁడు.

(రణభేరీమ్రోగుచున్నది. అందఱును యుద్ధమునకుఁ గడంగుచున్నారు)

కుప్పి—ఓరీ! దమ్మనా నీచా! హిందువా! ఇదె నాకరవాలంబు నీశిరంబుఁ ద్రెళ్ళనేయుచున్నది. (అని కత్తిఁ ద్రిప్పుచున్నాఁడు)

దమ్మన్న—ఓరీ! బుద్ధిహీనుఁడా!

ఉత్సాహ. బిరుదులెన్నియేనిఁబల్కు బీరమే? రణంబునన్
దిరముగాఁగనిల్వు నాదుతీవ్రభిందిపాలన
త్వరముఁజూతుగాని యేలపారసీకప్రేలెదా
నిరయమొందఁజేతునిన్నునీచ! చూడుమిత్తఱిన్.

(అని గుదియఁద్రిప్పి వైచుచున్నాఁడు కుప్పి గూలుచున్నాఁడు)

కుష్లాము—ఛీ! నీచేతనేమౌనురా. పలుయుద్ధంబులలో జయంబంది మించిన నాతో సానీవుపోరెదవు? ఇప్పుడైనను మరలిపొమ్మ.

దమ్మ—హనుమంతునిముందటనా కుప్పి గంతులన్నట్లు కుప్పిగంతులువైచి గంతుగొనె. ఎఱుఁగుదువా? నీపనియంతెయ. మూర్ఖ! నీగర్వమణంచెద. (అని ముద్గరంబును వైచుచున్నాఁడు)

కుష్లా—(తప్పించుకొని పరిఘాతంబును గిరగిరంద్రిప్పి వాని యుత్తమాంగంబుపై వేయఁగా దమ్మన్న కూలుచున్నాఁడు)

వెంకయ్య—నీచా! నీపొగరిట్లున్నదిరా! (అభిగమనంబుగావించి కృపాణంబుచే వాని కంఠంబుఁ దెగనరుకుచున్నాఁడు)

లా—ఓరీ. నీపీఁచంబణంగించెద జూడుము. (అని కరవాలికం ద్రిప్పుచున్నాఁడు)

వెంక—ఓరీ! పలుగాకీ! ఇదెవచ్చె. కాచుకొనుము. (ఘనంబును ఘనంబుగఁద్రిప్పి వైచుచున్నాఁడు. లా కూలుచున్నాఁడు)

రాసు—నీబ్రతుకెంతరా! దుర్మార్గుఁడా! (అభిషేణనంబుగావించి. కుఠారంబుగైకొని గురికొని యేయుచున్నాఁడు. వెంకయ్య నేలగూలుచున్నాఁడు)

ధర్మా—హా దుర్మార్గుఁడా! చండాలుఁడా! నీపొగరడఁగించెద. నిమేషమాత్రము నిల్వుము. (శతఘ్నిం బేల్చుచున్నాఁడు కొందఱుసైనికులును రాసును గతాసులగుచున్నారు.)

హసనల్లీ—ధర్మారాయనితో సంకులసమరంబుఁ గావించుచున్నాఁడు. యిద్దఱును భూమిపై నొరగుచున్నారు. పారసీకపుసేనాకలకలము. (హైదరుప్రవేశించుచున్నాఁడు)

హైదరు—ఆహా! ఎంతపుట్టినది. నిష్కారణ మనేకులు పారసీకధీరాగ్రేసరు లుసురులం బాసిరి. ఇస్సీ!

వెంగళ్రా—ఏఁడీ! పారసీకాధముఁడు. ఏఁడిరాజు! నానిశితకరవాలంబున వారిశిరంబుఁదెగవేసి తద్రక్తప్రవాహంబున మజ్జనంబుఁగావించి కీలాలధారల మదగ్రజునకు దానాదిక్రియలఁ గావించుచున్నాఁడ.

చామరము. ఎక్కడన్ మొరంగియుంటివేదినీదుశౌర్యమున్
దక్కలేక జూపుమింకఁ దప్పదోరి పోరుపెం
పెక్కనన్ను గెల్వనీవుబీరమున్నరాజవే
నిక్కచుంటివిప్డునీదునేటుశక్తిఁజూపరా.

హైద—ఏమిది సైనికులారా!

మాలిని. ఎంతటిభీమవిరామమదెచ్చటనేర్పడుఁగర్ణకఠోరమునై
చింతమనంబునఁగల్గెడిభూమిప! చెప్పుము వెంగళరాయఁడొకో?
యింతకుఁగారణమీవసుమీ యిదియిట్లగునంచుఁదలంపక నే
నెంతయుబుద్ధివిహీనతఁజేసితినీకొనిపాపపుఁగృత్యమిలన్.

విజయరామరాజా! మహాశూరులగు వారనేకులుసమసిరి. నీమాటలువిని యిట్టి యుద్ధంబునకుఁ దలపెట్టితి.

క. రా. విరాజితము. కొదుగకనీదగుమాటలనేవిని కొండెముగాఁదలపోయకయున్
బదపడివారు ననేకవిధంబులఁబ్రార్థనఁజేయుచు సంధినివే

డాఁదలఁప కెంతయుయుద్ధముఁ జేయబలంబుబలంబులడంగె నుజే
వదరిగిశూరులుబోయిరికాలునివద్దకరాతిశరాలిహతిన్.

కనుక యిప్పుడన్న చచ్చెను రోషావేశంబునఁ బ్రళయకాలరుద్రుని భంగినింగిముట్ట నార్చుచు రాజేఁడి? రాజేఁడి? యంచు వచ్చుచున్నాఁడు. నీవేయుద్ధంబునకుఁబొమ్ము జయించితివా సరే. లేకున్న నిందపాలగుదుము.

విజయ—(తనలో) తురక కఠినముగమాట్లాడుచున్నాఁడు. నాకు జన్యంబు సేయక దప్పనట్లున్నది. ఇప్పుడు వెనుకదీయుట పౌరుషముగాదు. కాని.

మత్తకోకిల. భానుఁబట్టఁగవచ్చు రాహువుభాతిఁ గానదహించు దా
వానలక్రియఁ గాలమృత్యువువన్నె వెంగళరాయఁడెం
తేని రోషవిభీషణాకృతిఁ దీవ్రమాగతి డాసెడిన్
వీనినోర్వఁగ నెట్లునాకగు వెట్టికార్యమొనర్చితిన్.

(కొంచెమనుమానించుచున్నాఁడు)

హాయి—ఏమిట్లనుమానించుచున్నావు?

పంచచామరము పౌరుషంబెరాజ నీకుఁ బారిపోవుటెంతయున్
వీరులేర్చి పైకిరాఁగ బీరమేది భీతిచేఁ
బోరిబుచ్చినన్ యశంబె పూరుషాళికాజిలోఁ
బారుకంటె హైన్యమెద్ది పాటిజేయభూస్థలిన్.

విజయ—(తనలో) ఎట్లయిననంగానిమ్ము. శత్రుసముదాయంబుతో సముదాయంబొనర్తుఁగాక (ప్రకాశముగా) ఇదె చూతము ప్రతాపము.

వెంగ—(తనలో) నేనొక్కఁడ మిగిలినాఁడను. మిగిలినవారలయ్యయిచోట్లఁగలహంబొనరించి వీరులంజంపి తాముసు గతాయువులైరి. అధైర్యమువలనఁ బ్రయోజనమేమి? ఆయోధులతో నాయోధనంబొనర్చి మడిచచ్చెదఁగాక.

(ప్రకాశముగా) వనమయూరము. హైదర! నరాధమ! మహాకలుష! దుశ్శీ
లా! దగునె? నీకిది ఫలంబనుభవింపన్
గాదనెదు మద్రిపుని కైతవపుమాటల్
భేదమును నీకు గలిగించకెటుదప్పున్.

హాయి—ఓహెూ! విలయకాల దహనుని కైవడి నీవచ్చువాఁడు వెంగళరాయఁడే కాఁబోలును.

వెంగ—ఓరీ ! పారసీకాధమా ! క్రూరచిత్తా ! నావిరోధిరాజు మాటలువిని యన్యాయంబుగ మాపై యుద్ధమునకుఁ బూనితివికదా ! ఇంకెక్కడికేగెదవు. నీబ్రతుకు వంటింటఁ గుందేల్జొచ్చిన చందమయ్యె మిమ్ముల నిద్దఱి నిప్పుడే లోకాంతంబున కనుచున్నాఁడ, అచ్చటికేగి మాయన్నగారిని శరణువేఁడుఁడు. అట్లుగాక మీయాత్మలకు జన్మాంతరంబునందైనను సుఖంబు కలుగనేరదు. (శతఘ్నింగాల్చుచున్నాఁడు)

విజ—అట్టి వృథాప్రలాపంబులనేల పల్కెదవు? చూడుమిదే. (అని స్వధితిం ద్రిప్పి వేయుచున్నాఁడు)

వెం—(తప్పించుకొని) ఓరీ! రాజన్యాబ్ధిబడబానలా ! తుచ్ఛుఁడా ! తురకకు లంచమిచ్చి మాయావరణంబు విధ్వంసనంబుగావింప సుంకించి వారిని మాపైకిఁ దెచ్చితివి గదా ! నిన్ను యమాలయంబునకనిపి నీదేశము నిదె స్వాధీనము చేసికొనుచున్నాను గోడపెట్టు చెంపపెట్టు నీకగును.

విజయ—బుద్ధిహీనుఁడా ! నాతో సరివత్తువురా ! ఏమి యీకారు ప్రేలాపన?

వెంగ—అంబురుహావృత్తము. ఓరి ! తురష్కులవేడితివా ! మమునోర్వఁజాలక పోరఁగ

నీవ్వీరుఁడవే ! రణశూరుఁడవే ! కౌరవిక్ దలందగఁగోకికో
సేరుదలంతురు దుర్మతి ? నీచుఁడ ! యిట్టిసేతలుచెల్లునే ?
ధారుణిలో జయమొందెదవే? యిఁకఁదక్కనేర్తువె యాజిలోన్.

విజయ—ఛీ ! ఓటిచేదను నీరుగారునట్లిట్లేల ప్రేలెదవురా !

తరళ. వినర ! దుర్మద ! నీదుగర్వపువేడబంబడఁగించెదన్
మనఁగనేర్తువె పోరినాతో మానుషాధమ ! యాజిలోఁ
గనవె నీయనుజుండు నీగతిఁ గారుకూతలఁగూసిగా
జనెను బెద్దలచాయకిప్పుడు చాలుప్రేలుట దుర్మతీ !

అని ముద్గరంబు సేయ

వెంగ—దానింఖండించి వైచుచున్నాఁడు (తిరిగి భిండివాలపరశుపట్టైస ముసలతోమర ఛురికాప్రాస వివిధాయుధ నికాయంబులఁ బ్రయోగించుచు బాహాబాహిం గచాకచిం ఘోరమగు సంకుల సమరంబొనర్చుచున్నారు)

(బుస్సీ ప్రవేశించుచున్నాఁడు)

బుస్సీ—(ఇరుదెఱంగులవారుం బోర నారసి వెంగళ్రాయని శౌర్యంబునకు మెచ్చి నట్లభినయించుచు తనలో భళీ ! వెలమకులమునకుఁ జాలినశూరుల మాయందుఁగాని

తురకల యందుఁగాని తక్కిన హిందువులయందుఁగాని నేఁగాన. ఇట్టి వీరులతోనా యుద్ధము. డబ్బుకాసించిన హైదరుమాటవింటి. తుదకేమౌనో (అని దూరముననిల్చి చూచుచున్నాఁడు)

వెంగ—ఓరీ! పారసీకాధమా! నిలువరా నాయెదుట.

హయి—ఓరీ! నీచా! దివాణద్రోహీ! నీపొగరణంచెదఁజూడురా (అని తుపాకీని పేల్చుచున్నాఁడు)

(ఘోరయుద్ధము జరుగుచున్నది)

వెంగ—(తనలో) బలంబరిగె. బలంబునుం దరిగె. నేనెట్లుపోరఁగలవాఁడ. జీవచ్ఛవంబుమాడ్కి నున్నవాఁడను కాయంబు గాయంబైయున్నది. సాయంతనంబు గూడబడె. పాపయ్య రాజాముకోటనుంచి వచ్చినట్లు వినుచున్నాఁడ. వానితోఁగలసి రేపు సమరంబునకుఁ గడంగితినా బాగుగనుండును. సూత్ర్మసేనతోఁ బోరుటంజేసి సైనలసట వొడమెడిని వెనుక సహాయమునకైన నేరును లేరు. (అని పరిఘుంబు ద్రిప్పి హైదరు తలపై విసరి వైవ)

హయి—తత్పరిఘాతనాహతిచే సోలి నేల మూర్ఛిలుచున్నాఁడు.

(సేనా కలకలము. బొబ్బిలివారిభేరీ మ్రోగుచున్నది. పారసీకుల హాహాకారంబు లెసంగుచున్నవి. విజయరామరాజు బుస్సీ హైదరు శరీరంబుజేరుచున్నారు.)

బుస్సీ—వీరవరులారా! ఈరోజునకు యుద్ధము చాలింపుఁడు.

(అందఱు నాగుచున్నారు)

(హైదరు శరీరంబు వీక్షించి ముక్కుపైవ్రేలుంచుకొని) ఆహా!

మందాక్రాంతవృత్తము. ఔరా! హైదర్బలమొడలి నీవాజిలోఁగూలితే. నీ
వీరావేశంబెటకరిగె నీవీరుతోఁబోర నేలా?
(వెంగళ్రావుంజూచి) ధీరా! వెంగళ్ నృపతిలక! నీధీరతస్త్రెచ్చవచ్చుం
బోరాటంబందు నినుగొనఁబోలు వారెవ్వరిందుఁ.

(విజయరామరాజుంజూచి) ఓయీ! ఇంకను బోరెదవా?

విజయ—ఖిన్నుఁడై యూరకుండె.

బుస్సీ—(హైదరు నాడిఁబరీక్షించి) నిష్ఠురహతిచేఁ బ్రాణము కడంటి మూర్ఛిల్లియున్నాఁడు సైనికులారా! మనగుడారంబునకుఁ గొనిపొండు విజనంబగుస్థలంబునకు గొంపోయినంగాని నేదదీరితెప్పిరిల్లఁడు (సైనికులుహైదరునెత్తుకొనిపోవుచున్నారు)

సేవకా! వెంగళాద్రిపుగారినిటులఁ బిలువుము.

సేవ—మహాప్రసాదము స్వామీ. (అని పోయితీసికొని వచ్చుచున్నాఁడు)

వెంగ—(ప్రవేశించి) సలామ్ పరాసు కులావతంసా!

బుస్సీ—సలామ్. వెంగళాద్రియఁడా! నీశౌర్యమనివార్యము నేమెచ్చితి. కొత్తపలిసీమ నీ కిచ్చితి రాజాముతోపాటు దానినేలుకొనుము,

సేవకా! మన పాలాలోనున్న చినరంగారావు నిటుల నెత్తుకొని రమ్ము.

సేవకు—చిత్తము దేవరా! (అని పోయి వెంటఁగొని వచ్చుచున్నాఁడు)

బుస్సీ—వానినెత్తుకొని ముద్దాడుచు వెంగళాద్రియఁడా! ఈపిల్లవాని నెఱుఁగుదువా? నీయన్నకొడుకగు చినరంగారావు సుమీ! దాది వీని నెత్తుకొని సామర్లకోటకుఁ దీసికొనిపోవుచుండ నీబాలుని ముఖంబాచంద్రబింబమును హసించుచు నెంతయు ముద్దులొలుక నాకు వీనియందుఁ బుత్రివాత్సల్యత మీఱి యిసుంతయు హానిజనించకుండునట్లుగాపాడుచు నాడేరాయందుంచినాఁడ. ఈముద్దులకుఱ్ఱఁడు తండ్రికంటె నెక్కుడు స్థైర్యశాలి. త్రయీవర్ష వయస్కుఁడయ్యును గుడారంబునంగల బహువిచిత్ర వివిధగాండారాది వస్తుసంతాన సంకుల భాండారంబున నీ బాలువిడువ. నొక్కశాతాసిఁ జేఁబూనియాచిత్తరువుం బొమ్మల నీరులఁగాఁ దలపోసి నరుకఁజొచ్చె. ఈబాలుండపరిమిత శౌర్యశాలియగు. సత్వరము వీనిందీసికొనుము. (అని వెంగళ్రావునకిచ్చుచున్నాఁడు)

వెంగ—(వాని నెత్తుకొని ముఖము నివురుచు నన్నుందలంచుకొని దుఃఖించుచున్నాఁడు.)

బుస్సీ—ఊరడిల్లుము. విచారించిన నేమిప్రయోజనముగలదు?

వెంగ—(బాలుంజూచి)

ఉ. బాలక! చిన్నికుఱ్ఱ! పసివాఁడ! కటా! చినరంగరాయ! నీ
పాలిటికేగుదెంచెనొకొ పాపపుయుద్ధము నిన్నుఁజూడఁగాఁ
దాలిమిఁదూలుచుండెఁ దలిదండ్రులులేని యనాథఁజేయనే
వీలను జాలిదైవమెడలించెనొ నీయెడ ముద్దుకుఱ్ఱఁడా!

(అని యనేక విధంబుల వనరుచున్నాఁడు.)

బుస్సీ—రాజా! ఊరడిల్లుము. మీవంటితెలిసినవారిట్లు చింతపాలుకాఁగూడదు. సమస్తము దైవాధీనము గదా!

వెంగ—అత్యంతప్రేమాస్పదుండగు సోదరవియోగంబెట్లు సహించువాఁడ. జననీజనక రహితుండగు నీముద్దులపట్టి మోమునవలోకించి యెట్లీదుఃఖము భరించువాఁడ.

(విజయరామరాజేమో విచారించుచున్నట్లభినయించుచు సమీపస్థలంబున నిటునటు దిరుగుచున్నాఁడు.)

బుస్సీ—ఏమిసేయఁగలము ? నిన్నుఁజూడ నాకును జాలికలుగుచున్నది. ఈరాజుమాట లువిని హైదర్జంగుపొరబడి మీకిట్టి యపకారమునర్చె. వారిసలహావిని నేనును వారి తోఁగలసితిని. కుక్కతోకఁబట్టి గోదావరి యీదినట్లాయెనాచరిత్ర. నీవిఁకేల దుఃఖిం చెదవు. అయినదానికైవగచుట గతజలసేతుబంధనము. నీవైన నిఁక సుఖంబుండుము.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

రంగము :— బొబ్బిలికోట.

(వెంగళ్రావు గుడారములో గాయములచే బాధపడుచు మాన్పుకొనుచుండఁగా తాండ్రపాపయ్య ప్రవేశించుచున్నాఁడు)

పాప—వెంగళ్రావుగారూ ! (దుఃఖముతో) ఎటులనున్నారు ?

వెంగ—ఇట్లున్నాను. (అని దేహముంజూపుచున్నాఁడు) (దీనస్వరముతో) ఈకోట కుమాకు నిట్టియవస్థ తటస్థమైనది. (యేడ్చుచు) ఇప్పటికి యుద్ధముమాని మూఁడురో జులైనది. ఇరువాగులవారమును గాయముల మాన్పుకొనుచున్నాము. నాబ్రతుకు కని శ్చయముగనున్నది. విజయరామరాజు బుస్సీలు సుఖంబుగనేయున్నారు. అన్నకగ్ని సంస్కారాదికంబులనైనఁ జేయశక్తిలేదు. ఇట్లు పడియున్నవాఁడ. ఏమిచెప్పఁగలను ? ఇప్పటి మనలోనేనొక్కఁడ సజీవుండనైయుంటి. ఇఁక నీపిల్లవాని గతియేమౌనో ?

పాప—రంగారావుందలఁచుకొని)

శా. రంగారాయనృపాల ! ధైర్యగుణధుర్యా ! శౌర్యగాంభీర్యసం
నంగా ! రాజకులీనరత్నమ ! రణోత్సాహా ! ధనుశ్చాతురీ
గంగానందన ! యన్న ! బొబ్బిలిపురక్ష్మానాథ ! పోరంగటా
భంగంబొందితె ! శత్రువౌవిజయుచే ! ఁబాటిల్లెగామృత్యువుల్.

రంగరాయా ! ఇంకను శాత్రవజయంబుతోఁ బ్రాజ్యరాజ్యలక్ష్మింగైకొని యఖండ వైభవము ననుభవించెదవనుకొంటింగాని యవియన్నియుం గలలోనివార్తలయ్యెంగదా ! హా ! దైవమాయ ! అమ్మాత్ర ! మల్లమ్మాదేవీ ! నీవును భర్తగారికిఁ ద్రోవఁజూపితే ! అప్పా. నీకెంతదశగల్గినది. ఎంతపనిజరిగినది.

శా. అమ్మా ! మల్లమదేవి ! సాధ్వీమణి ! మాయప్పా ! సుశీలాత్మ నీ
కిమ్మాడ్కి న్గడుదైన్యమబ్బునని నేనింతైన నెంచంగలే
దమ్మా ! నీవగుధర్మవర్తనము గాయంలేదెసుంతైన ? జీ
వమ్ముల్ సాంఘిక మృత్యువెక్కరణి సంప్రాప్తించెనీకియ్యెడన్.

(కోట నట్టిక్కలం గలయంజూచుచు) ఆహా ! స్త్రీబాలవృద్ధ సంకులంబైయుండు నీ కోట కెంతపాటువాటిల్లె అహో ! దివసపంచకంబు వెనుకఁ గలకలనాదుచుండెడి బొబ్బిలికోట నేటికి భూతప్రేత పిశాచంబుల కిలకిలధ్వని సంకులంబై పరేతవాటికయయ్యె.

చ. వెలవెలబారె గేహములు వెల్మకొలంబుల జాడలేదిదే
వెలపలలోపలంగనిన భీతిజనించెడిఁగోటకాళికా
నిలయమువోలె శాకినులనిండి మనంబునవేదనంబు వ్యా
కులమొనరించుచుండె నిదిగోపలలాస్థిమయాస్రధారలన్.

హా ! రంగారాయక్షితీంద్రా !

గీ. నన్నురాజాముకోటకుమున్నెయేల
కాపుగాఁబంపినాఁడ వక్కాలమందు
నేనెయుంటినా శత్రులనెగడకుండఁ
జేయనే రంగరాయ చేసేతవచ్చె.

అనేకవాదనలఁజేసి ననేకవిధంబుల నేడ్చినను బెడచెవింబెట్టి పట్టిపంపితివిగదా ! ఎంత నెట్టిపనిఁజేసితివి. నీయాజ్ఞోల్లంఘనంబునకు వెఱచి పోవకదప్పదయ్యె తిరిగివచ్చునంతకైనను సజీవులై యుంటిరిగారుగదా !

ఉ. పున్నెపులోకముల్ మిగులఁబొందఁగమీకిదె చేయుచుంటినా
కన్నులనీరునించి కడఁకన్ జలతర్పణమివ్విధంబునం
జన్నదివచ్చునేయిఁకనుసాహసముంగనిశత్రురక్తసం
పన్నతమీకుఁదృప్తిపఱుపన్దలపోయుచునుంటినియ్యెడన్.

(వెనుకకువచ్చి వెంగళ్రాయునిజూచి) (దుఃఖముతో తనలో) ఈతనితో ముచ్చటించిన నేమగు. తననుదానెఱుంగఁడు. గాయంబులచే స్మృతితప్పియున్నాఁడు. దైవమీతనినైన రక్షించుఁగాత. ఈబాలునికిఁ జిరాయుష్యమగుగాక. విచారించిన నేమిప్రయోజనము. ఇప్పుడైన నేమిబోయె. పారసీకపరాసులతోడ విజయరామరాజుం గతాసునింజేసి బొబ్బిలిపౌరుషంబు నిలువంబెట్టెదను.

శా. చండారాతిహయప్రకాండముల నేఁజక్కాడెదం గుంభినుల్
దండంబుల్దెగి ఖండఖండములుగాఁ దూటాడెదం బంట్లను
ద్దండప్రక్రియఁ జెండి వైచెదను దోర్దండ ప్రతాపంబునన్
గండల్గాండలుగాఁ గస్యందనములన్ ఖండింతు నొక్కుమ్మడిన్.

కానిమ్ము (తనలో) రామచంద్రుండంతటివాఁడు వాలిం బొంచి పొరిగొనలేదా? అర్జునుండు మరుగుపెట్టి గంగాసూనుం దెగనేయలేదా? కుంభజు హరణార్థమై ధర్మరాజు బొంకియుండలేదా? వారికెట్టియపవాదమువచ్చెనో నాకు నదేరాఁ గలదు, గాథగలినరిగి యిట్టి దురాత్ములఁ జంపినంగాని వేఱొండు విధంబున నా కోపానలంబు చల్లారనేరదు. ఇట్లుగాక నీతులువలం జంపు మార్గంబులేదు. ధర్మమే గానిమ్ము ధర్మమే గానిమ్ము! ధర్మాత్ములు సుగుణనిధులుత్తమోత్తములగు రంగారాయమల్లమ్మా దేవులం జంపించిన యీ పాతకియగు రాజుం భూమిం బ్రతుకనిచ్చితినా ధారుణిక్షత్రియమొనరించినవాఁడనగుదును. (ప్రకాశముగా) సేవకా! నీవేగి విజయరామరాజున్న స్థలముం గలయంగనుంగొని రమ్ము.

సేవ—చిత్తము (అని వాఁడేగి తిరిగివచ్చి) మహాప్రభూ! నాకుఁ బో వీలుగాదయ్యె. ఏమి సేయను?

పాపయ్య—పోనిమ్ము. నేనేపోయెదంగాక. (తనలో) నేను మాఱువేషము వైచికొని వారిగుర్తుమాటలు వచించుచుఁ గాదారిపొర్లునలేచిపోయి గుడారంబు జేరెదను గాక. (అని యట్లొనరించుచున్నాఁడు)

(అందఱు నిష్క్రమించుచున్నారు)

రంగము :—విజయరామరాజుగుడారము.

పాప—(రాజునిద్రించుచుండఁగా గుడారంబుగుడ్డను గరవాలంబునఁ జించివైచి లోపలం బ్రవేశించి) పులి పులి! (అని కేకవేయఁగా)

విజయ—లేచి (తనలో) పులిపులి యని వినవచ్చుచున్నది. ఈపులి తాండ్రపాపయ్యగాని వేఱుగాదు. (కన్నులందుడీచికొనిలేచి పాపయ్యంగని మిగుల లావైనవాఁడు గాన దిగ్గున లేవలేక) (ప్రకాశముగా) ఎవఁడవురా! (అని చెంతనున్నకత్తిం దీసికొనఁ బోవుచుండఁగా)

పాప—గీ. తాండ్రపాపయ్య యనువాఁడఁ దగినయట్లు
నీవు చేసిన దుర్మార్గ నీచకృత్య

సునతనుహాపక పొహెసి మెనను విశద
సడఁగఫలమియ్యవచ్చిన వాఁడఁజుమ్మీ.

(అని హారాత్తుగఁ జేయినరుకుచున్నాఁడు. పెరహస్తంబున దీసికొనఁబోఁగా దానింగూడ నరకుచు) ఏమిరా! పాపిష్ఠి! చండాలుఁడా! నీకూౄరకర్మము నిన్నుఁగట్టికుడిపినదిరా. బొబ్బిలినేలెదవా? (అని కాలు నరుకుచున్నాఁడు) రంగారాయం జంపితినని సంతసించుచున్నావా? (అని యూరుపులనరుకుచున్నాఁడు. ఇట్లు ముప్పది మూఁడుచోట్ల నరికి చిత్రవధగావించుచున్నాఁడు)

(సైనికులు ప్రవేశించుచున్నారు) ఘోరమగు కలకలము.

సైనికు—(పాపయ్యంజూచి) ఎవ్వఁడవురా! దుర్మార్గా! దొంగా! (అనియొక్క పెల్లున జుట్టిముట్టి హైదరును మూర్ఛఁదెలిసియున్నవాఁడేగాన ప్రవేశించుచున్నాఁడు)

హైదరు—ఓరీ! కూౄరాత్మా! నీచుఁడా! దొంగా! చూడు నిన్నేమిచేసెదనో! రాత్రివచ్చి యిట్లు చేసితివిగా! నిన్నిప్పుడ పొరిగొనెదఁజూడు.

(అని భీమాట్టహాసము చేయుచున్నాఁడు.)

పాప—(తనలో) నేను బగదీర్పఁబూని చేయవలసినదానింజేసితి. వీరంతకంతకురోషంబుమీఱఁ బైపైకి వచ్చుచున్నారు. రంగారాయుని జంపినరీతినే నన్నుంజంపుదురు.

ఉ. నీచపురాసుసేనలకు నేనిటులోఁబడిచచ్చుకంటె బా
హాబలితాసి ధారను బరాసుఁడనై దివికేగ మేలుగా
దే చిరకీర్తి పౌరుషములెంతయు నిల్చును భూమిలోన శౌ
ర్యాచరణంబొనర్చెననిఁ అల్లెయెనర్చుట మంచిదెంచఁగన్. (ప్రకాశముగా)

ఓరీ నీచులారా! మీచేఁజచ్చెదనురా? నాకిప్డు తృప్తియైనదిరా! (తనలో) రంగారాయపుల్లమ్మలులేని బొబ్బిలికోట తిరిగిచూచుటకంటెదేహంబు బొలియంగుటే మేలు (అని రోషావేశంబునఁ గరవాలంబుఁ ద్రిప్పుచు శత్రువులపైఁబడి సైనికనికాయంబుతో హైదరుం గాలుపోలికనిచి తానును బొడుచుకొని మేన దొలఁగుచున్నాఁడు)

(సైనికుల హాహాకారంబులెసంగ బుస్సీ ప్రవేశించుచున్నాఁడు)

బుస్సీ—(ఆశ్చర్యముతో ముక్కుపై వేలుంచుకొని తనలో) ఆహా! ఎంతపనిచేసె పాపయ్య! వీడే యుద్ధసమయంబున నున్న మమ్మందఱి నప్పుడ చంపినైచును. కూౄర

ర్మము పాపిష్ఠులం గొట్టుకొనిపోయె. న్యాయాన్యాయంబుల దైవమే యుంగదా? పరులకపకారమెంచువాఁడు తనకుఁ దానే నశించును. (వెంగళ్రాయ గుడారంబున కుఁ బోవుచున్నాఁడు)

(అందఱు నిష్క్రమించుచున్నారు)

రంగము:—వెంగళ్రాయ గుడారము.

(మంత్రిమొదలగువారు బలిసియుండ బుస్సీ ప్రవేశించుచున్నాఁడు)

వెంగ—లేచి. సలామ్. బుస్సీగారూ!

బుస్సీ—సలామ్. ఆరోగ్యుఁడవైతివే?

వెంగ—స్వామీ. నెమ్మదిగానుంటిని. గాయంబులుమానె. మీకటాక్షంబునఁ బ్రాణం బులుమాత్రము నిలిచె.

బుస్సీ—ఇఁక వగఁజెందకుము. దైవంబు న్యాయంబుచేకూర్చె. నిష్కారణము మిమ్ము ల బాధపెట్టిన హైదరుజంగును రాజును జచ్చిరి. పాపయ్యయుఁ బ్రాణంబులఁ బో రంగె. బొబ్బిలిని నీవేయేలుకొనుము. సుఖంబుండుము. నామాటయే కొలు. అయి నదానిఁగురించి విచారింపకుము. శూరులగువారికే యిట్టి కష్టంబులు సంప్రాప్తమ గుఁగాని పెరవారలకు యుద్ధములేల? చావులెక్కడివి? నీకు క్షేమమగుఁగాక. పట్టాభిషిక్తుండవుగమ్ము. నేనుబోయివచ్చెద.

వెంగ—మహాప్రసాదము. స్వామి! (బుస్సీ నిష్క్రమించుచున్నాఁడు)

మంత్రి—(సమస్తమంగళద్రవ్యంబులాయత్తపఱచి పురంబు శృంగారంబుగావించి నృత్తగీ తవాద్యంబులెసంగ సభాస్థానంబున సింహాసనంబుదెప్పించి వైచి యందు వెంగళ్రా యునునిచి మహోత్సవము జరిగించుచు) వెంగళ్రాయాగ్రణీ! ఈయఖండ భూమం డలంబునకు రాజవుగమ్మి. మమ్ము చరితార్థులుగఁజేయుము. ఇదియ పురజనుల కోరిక. అట్లనుగ్రహింపుఁడు. స్వామీ!

వెంగ—(దీనత్వము ముఖమునందుఁదోప) అట్లనేకావింపుఁడు. (అని యన్నందలఁచు కొని.)

శా. అన్నా మొన్నటిదాఁక నీవునిజబాహాటోపమేపారసం
పన్నప్రక్రియరాజ్యమున్నలిపియేసాపంబొనీవిప్పడా
పన్నత్వంబునుబొందిపోయితివినాపాల్జేసియీభూమినీ
కన్నంబోదునుముందెయీవిధమునాకావంతయుఁగాదెల్పినన్.

మంత్రి — ఓరడిల్లుము రాజా! శుభసమయంబున విచారించుట కూడదు. "దైవాధీనం జగత్సర్వ" మను వాక్యములఁ దెలియవే? ఈకాలంబున కీరీతిగ జరుగవలసినదని బ్రహ్మ వ్రాసియుండఁగా నన్యథా యెట్లు జరుగనేర్చు? వీరుచంపిరి వారుచంపిరి యనుకొనుట యెంతయు వెఱ్ఱితనము. సమస్త చరాచరంబులకుఁ గార్యంబులకుఁ బరమేశ్వరుఁడే మూలకారణముగాని వేఱుకాదు. నేనొనరించితిననువాఁడు పిచ్చివాఁడు. భూమిపై నెంతటిని జాచియుండలేదు. ఎందఱు రణనిహతులు కాలేదు. రామాదులగు మహారాజులును హరిశ్చంద్రాది చక్రవర్తులును భూమిపైనుట్టిగట్టుకొని యూచుచున్నారే! వారికీర్తిమాత్ర మాచంద్రతారార్కము జగద్వ్యాప్తమై తులంగలించుచున్నది. అట్లనేమికీర్తియును భూమియెంతదాక నుండునంతకాల ముండకపోదు. మనంబున సంతసంబుమ్లడింప యుత్సాహంబుమీఱియుండుటే మీవంటిఘనుల కుత్తమమగు తెఱంగు. ప్రపంచమునజరుగు కార్యంబుల సాక్షిభూతులమై చూచుచుండుటయే మనపని. "కాతేకాంతా కస్తేపుత్ర స్సంసారోఽయమతీవవిచిత్రః కస్యత్వం కఃకుతఆయాతస్తత్త్వంచింతయ యదిదంభ్రాంతః" అనునట్లు వీరందఱు దైవమను నాటకునిచేనాడించు జంత్రపుబొమ్మలుగాఁ దెలియఁదగు. తనువులశాశ్వతములుగదా! "కిందాకుమీదాకువాసగాదే" వారికై వగవనేల? సమస్తధర్మంబులు మీకుగోచరములే.

(పట్టాభిషేకమహోత్సవము జరుగుచున్నది మంగళాక్షతల వెంగళ్రావుపైఁ జల్లుచున్నారు.)

వెంగ. — మంత్రిపుంగవా! నీచెప్పిననీతి నామనంబునంగల చింతంగొంత ద్రోచివైచినది. నీవంటిధీసచివుండు గలుగఁగ నెట్టి కొఱంతయులేదు. నేనొక్కదానిం జెప్పెదవినుము. ఈవీరబొబ్బిలి మాయన్నగారగు రంగారావుగారిదిగదా! తన్నుఁగాఁ జూచుకొమ్మని యీచినరంగారావును నావశముఁ జేసిపోయినాఁడు. ఈరాజ్యమునందీపిల్లవాని నభిషిక్తునింజేసినంగాని నాదుఃఖముచల్లారనేరదు. కాన నీకుఱ్ఱని యువరాజ్యంబునకుఁ బట్టాభిషిక్తునిగఁజేసెదను. వానికి యుక్తవయస్సువచ్చునందాక నేనే రాజ్యముచేసి యాపైని ధరాభారంబు వానికిచ్చివైతు. అట్టియన్నగారికేలేని రాజ్యము నాకేల! సచివాగ్రణీ! సమస్తమంగళద్రవ్యంబులఁ దెప్పింపుము.

మంత్రి. — సర్వము సిద్ధముగనున్నవి రాజా!

## * వెంగళరంగారావు పట్టాభిషేక మహోత్సవము. *

వెంగ. — చెంతనున్న చినరంగారావును సింహాసనంబునందునిచి సభికులారా! మంత్రులారా! మిత్రులారా! మాయన్నకుమారుండగు నీబాలుండు వెంగళరంగారాయ

ధేయంబున నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధులనలరారుఁగాత. (బాలునివంకఁజూచి.)

ఉ. భూతలమెల్ల నేలుమునసమున్నతితో, జగదేకవీరవి
ఖ్యాతినిఁగాంచు రాపుకులమంతయు రాజిల, దీర్ఘజీవితం
బౌతకుమారనీకిల, మహావిభవంబుదనర్చుఁగాత ని
ర్భీతినరాతిభూపతులపేర్మినడంతువుగాత, నిమ్ములన్.

భూసురాశీర్వాదంబులు సెలంగుచున్నవి. దేవతలుపుష్పవృష్టిఁ గురియించుచున్నారు. సమస్తజనులు సంతసించుచున్నారు. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

భరతవాక్యము.

మంగళమహాశ్రీవృత్తము. ఏలుదురుగాపుత మహీంద్రులుజగంబులసమిద్ధతరధర్మగతితోడ
న్మేలొదవుఁగాతధరణీసురల కాపులకుమేదినికిమేదురసుఖంబాఁ
గాలమునవర్షమిడుఁగాపుత పురందరుఁడు కాన్యపినిసశ్యము లెసంగన్
బాళివిడనాడుచుశుభంబుఁగను దేశములు ప్రాణులకునాయువులు హెచ్చన్.

సీ. నిధినవగజచంద్రనిగదితహాయాణశకంబునకున్ సరిగన్నయవ్వి
కారిసంవత్సరకలితవైశాఖ మాసంబునశుక్లపక్షంబునందుఁ
బంచమీభాస్కరవాసరంబున దీనిరచియించినాఁడనేఁబ్రతిభమీఱ
దీనిబొండాడపురీనివాసుండైన భోగేశ్వరునికృపఁజూన్కితోడ

గీ. నిందుభారంబునాదైవమందెయుంచి
యఖిలకృతులకలంకృతియగుచుసకల
సుకవిజనులచేనీకృతిసొంపుఁగాంచి
ధరణిమెఱయుతనాచంద్రతారకముగ.

గద్య. ఇది శ్రీమద్బొండాడపురీనివాస భోగేశ్వరేశ్వరశాశ్వత కటాక్ష
నిరీక్షణప్రసాదిత మృదులకవితాధురంధర, భారద్వాజస గోత్రపవి
త్రాపస్తంబసూత్ర కాళ్ళకూరి కులకలశార్ణవ రాకాకైరవ
మిత్ర భోగమాంబాచ్చయామాత్య దంపతీపుత్రభాగ
ధాట్కవికుమారాగ్రేసర, సాంబశివరాయ
కవివర, ప్రణీతంబైన రంగారాయకద
నసమువాకారంబు సర్వము
సమగ్రము.

కాకినాడ:—సుజనరంజనీ ముద్రాక్షరశాల 1899.

# శుద్ధపత్రిక.

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 19 | పుత్రా | మిత్రా |
| 20 | యొక్క | నొక్క |
| 11 | నయ్య | నయ్యె |
| 19 | నరుఁడు | నృపుఁడ |
| 22 | పంక్తి | పంక్తి |
| 3 | వారిత్తరి | వారిత్తఱి |
| 17 | మగుసె | మగునే |
| 19 | నోర్వ | నోర్చు |
| 20 | సుర | సురు |
| 27 | అనేకప | అనేక |
| 3 | నాతిశుమా | నాంచద్యశః |
| 10 | స్వాగతంపు | స్వాగతము |
| 26 | పలు | బలు |
| 15 | డాంథ | డాండ |
| 8 | లంబోని | త్రైన |
| 5 | జాట | ఁబాట |
| 11 | వకీలన్ననునిముష | వకీలవనంగనిమిష |
| 28 | చెప్ప | ఁజెప్ప |
| 11 | డోర్బలాంథ | డోర్బలాంక |
| 12 | మసఁగుటపోఱఁ | మసగుటపోరఁ |
| 7 | గుమ్మమెదుర | గుమ్మ్రము నెదుర |
| 11 | ముత్తిల్లి | మత్తిల్లి |
| 6 | కారుని | కారిని |
| 13 | వారు. నజేయులు | వాఁడు. నజేయుఁడు |
| 7 | నరపతులను | వారిం |
| 9 | భయసం | రయం |
| 20 | మిక్కలి | మొక్కలి |
| 23 | నేర్పరింపు | మెర్పరింపు |
| 9 | తురష్కుఁడు | తురుష్కుఁడు |
| 11 | నీరద | నీఱవు |
| 11 | వ్యదీకము | వ్యళీకము |
| 16 | చెప్పము. మఱియు | చెప్పుఁడు మఱియుదమ్మన్న! |

| | | | |
|---|---|---|---|
| 47 | 7 | వారు | వీరు |
| 48 | 3 | పెంకి | పెంకె |
| 51 | 14 | బాయనివి | బాయనవి |
| ,, | 51 | చాలదూ | చాలదా |
| 54 | 15 | రాజునిం | రాజుం |
| 60 | 8 | ప్రివిమల | ప్రవృత |
| ,, | 26 | కోహటించుట | కావటించుట |
| 61 | 2 | సందేశమెను | సందేశమును |
| ,, | 7 | యమియించి | నోంచితి |
| ,, | 11 | పన్నాగము | పన్నకము |
| 62 | 25 | దురటిల్లు | దూకొను |
| 63 | 13 | జంఝు | ఝుంఝు |
| 65 | 16 | మత్కారాసి | దత్కారంబు |
| ,, | 28 | కోహా | కావ |
| 67 | 21 | భీమ | భీరు |
| 68 | 27 | నిజమరి | నిజనులె |
| 70 | 20 | బీజ | వంశ |
| ,, | 21-24 | బ్రాహ్మణ......శ్రేణికిన్ | నీతలంపట్టులకా |
| 72 | 9 | యిది | యది |
| 82 | 2 | రాణిసై | రాణి |
| ,, | 18 | తక్కని | తక్కిన |
| 83 | 4 | నాయక. బాలులార | నాయిక. బాలురార |
| ,, | 12 | ప్రతివ్రత | పతివ్రత |
| ,, | 22 | పొంత | బాంతన |
| 84 | 13 | జాలపురా | జాలపు |
| ,, | 17 | వీనితో | వీని |
| 85 | 17 | వధియించుచున్నాఁడు | వధియించుచున్నారు |
| 86 | 22 | లేకనో | లేకనే |
| 88 | 24 | పరిఘాతంబు. యుత్తమాగంబు | పరిఘాతనంబు. యుత్తమాంగంః |
| 90 | 16 | బుబ్బినం | జచ్చినం |
| ,, | 26 | ఖేదమునునీకుగిలిగించ | ఖేదమునునీకుఁగలిగించ |
| 92 | 23 | గొన | గెలువం |
| 94 | 19 | మనలో | మాలో |
| 95 | 17 | వాదనలఁజేసి | వాదములఁజేసిన |
| 98 | 21 | [illegible] | |

గలవారును, మిగుల పొడవుగ నుండువారును మిక్కిలి పొట్టివారును, స్థూలదేహులును, వక్రశరీరులును, నొంటిచేయియు నొంటికాలును, రెండు తలలును, మూడునాలు, గైదుతలలును గలవారును, నిడుద కోరలును, వ్రేలాడు ముక్కులును, వెడదనోళ్లును, వెలికి జాఱిన పొడవు నాలుకలును, పెద్దపెద్ద పెదవులును, గలిగిన నల్లని వికార రూపములు గల మూడుకోట్ల రాక్షస వీరభటులు, తమతమ యా కృతులకుం దగిన వాహనంబు లెక్కి, పరశు, పట్టస, తోమర, భిండివాల, ముసల, ముద్గర, గదా, ఖడ్గప్రముఖ నానావిధాయుధం బులను బూని, యఱపులు, నట్టహాసములును, పెడబొబ్బలును సతిశ యింపగా, తమ్ము పరివేష్టించి వచ్చుచుండ, తాఁ మాయకల్పితములైన తేరుల నారోహించి, భేరీ, కాహళ, తమ్మట ప్రముఖవాద్యధ్వనులు మిన్నుముట్టగాఁ గదలి యతిరభసంబున "నాంజనేయుని పట్టుకొని బంధించెదము కాదేని చంపెద" మని తమ ప్రతాపం బేర్పడం బలుకుచు తోరణ స్తంభంబు దగ్గఱకువచ్చి, అచ్చోట నుండినవారిని సంహరించి, యలసటఁ దీర్చుకొనుచు పరిఘూహస్తుండై కూర్చుండి యున్న, యమ్మహా బలాత్మజుం గాంచి, రోషంబు మీరగాఁ జుట్టు కొని "ఓరీ! కీశాధమా! ఎక్కడివాఁడవు? ఏల వచ్చినాఁడవు? ఎట్లు వచ్చితివి. ఇది మైరావణ ప్రభుని నగరంబని తెలియదా? ఇచటి కరుదెంచిన నీకిఁక బ్రతుఁకెక్కడిది? మృత్యువు కుత్తుకఁజొ చ్చినట్లే యని తెలిసికొని చావునకు సిద్ధమగుము" అని బెదరించి పలుకుచు, తొలుత పట్టుకొనుటకుఁ బ్రయత్నించిరి. కాని యా వా నరయూథ ముఖ్యుఁడు దాపున వచ్చిన వారల నత్యాగ్రహముతో, తనచేతి పరిఘాయుధముతో మోది మడియించెను. ఇంక పట్టుకొన నలవిగాదని యెంచి, సేనాపతు లతనిఁ జంపుటకై సేనలను గవి యించిరి.

హనుమంతుఁడు వారలం గని చీరికిఁగొనక "ఓగు రక్కసు లారా! నాచేత మీరేల వ్యర్థముగాఁ జచ్చెదరు? నన్ను జయించు టకు మీకుగాని, మఱి పరమేశ్వరునకుఁగాని శక్యముగాదు. నేను వాయుపుత్రుఁడను. హనుమంతుఁడను వాఁడను, సుగ్రీవుఁడనెడి వానర రాజునకు మంత్రిని. సూర్యకులశేఖరుఁడగు రామచంద్రుని బంటను.

మీప్రతాప బల సామర్థ్యంబులు నాముందు జెల్లవు. శీఘ్రముగా మరలిపోయి, దుష్టుఁడును పాపశీలుఁడును నైన యామాయకానిని— మీప్రభుఁడగు కుటిలుని—ఆమైరావణునిఁ గొనిరండు. నేను చెప్పిన మాటలు వానికిఁ దెలుపుఁడు. కాదేని మిమ్ము నిమిషమున యముని యింటి పూటకాపులం గావించెద''—అని యందఱకును వినునట్లు గొంతెత్తి యఱచి పలికెను.

అతఁడు నుడివిన యీమాటలు చెవుల సోఁకగనే యుద్దండ మహోద్దండుల కోప మధికరించెను, "ఆహా! ఈబికారికోతి యీ మనల జయించునది? ఈమర్కటమా మనకు బుద్ధిగరపుట. బాగు బాగు. గర్వమున కన్నుగానక వదరుచున్నాఁడు. ౘంపుఁడు ౘంపుఁ'' డని సైనికులఁ గవియించిరి. మారుతి వారి గర్వమును గనుఁగొని "ఎట్లూ? చంపెదరా? అదియేలాగో చూచెదఁ గాక''—యని విజృంభించి, పరిఘాయుధంబుతో వ్రేయుచు, తలలు వ్రక్కలుజేసియు, కాళ్ళను చేతులును విఱుగఁ గొట్టియు, నురంబులు బగిల్చియు. నడుములు దునుఁగనేసియు, వాహనంబులఁతోడ గుట్టలు పడనేలగూల్చి నెత్తురు వెల్లువ పాఱునట్లు చేసిన, రక్కసులు యెదిరించి నిలిచిపోరలేక, వెఱచి నలుగెలంకులకును పరుగెత్తఁ దొడంగిరి. సేనాపతులు తమ బలంబులు మూడుపాళ్లు హతమగుటయు, మిగిలిన వారు భీతిల్లి పరువిడుచుండుటయు, నాంజనేయుండు వెన్నంటిమోది వారిని చంపుచుండుటయుం జూచి, మండెడి నిప్పులో నేయిబోసిన విధంబున, నత్యంత కోపావేశంబుతో ప్రజ్వలించుచు, పరువిడుచున్న బలంబులను నిలువరించి ధైర్యంబుఁగఱపి కూర్చుకొని వచ్చి భయంకరముగా నంజనీనందనునిం దాఁకిరి. అపు డతనికిని వారికినిపోరు ఘోరంబుగ నయ్యెను.

మైరావణుండు కాళికాలయమున రామలక్ష్మణులు లేకుండుట నెఱింగి చింతించుట.

పూర్వోక్త క్రమంబున సేనానాయకులకును, హనుమంతునకును యుద్ధము జరుగుచుండఁగా, మైరావణుండు, "తాను దశరథ పుత్రులను భద్రకాళి గుడిలో బెట్టియుండుట నొకవేళ నాంజనేయుండు దెలిసికొని, వారల నచ్చోటనుండి గొనిపోయి మఱి యెందైన

నునిచి యుందురేమో"—యని సంశయించి, యారీతి నెఱుంగఁ
దలంచి జల్లి, జగజ్జల్లి యను వారలంబిలిచి "మీరు భద్రకాళి
గుడికిఁ బోయి, యచ్చట నేను పెట్టిన రామలక్ష్మణులు గల పెట్టె
య నెత్తుకొని, నా చెల్లెలు దోర్దండి యచ్చటికి వచ్చి యుండును
గాన, యామెను వెంటఁ బెట్టుకొని త్వరితముగాఁ నరుగుదెందు పొం"
డని యాజ్ఞాపించె. ఆ రక్కసు లిరువురును నతి వేగంబుగ కాళీ
దేవళమున కరిగి చూచిరి. అచట మైరావణు డునిచి వచ్చినట్లు
చెప్పిన పేటికగాని, యతని తోడబుట్టువు గాని వారికిఁ గనుపడక
గుడిలో నలుగెలంకులను వెదకిరి. సందు గొందులలో చూచిరి.
వెలుపటను, లోపల పలుమారు పరికించిరి. కాని, ప్రయోజనము
లేకపోయినది. పెట్టెగాని, దోర్దండిగాని కనుపడనే లేదు. ఎట్లు
పోయినది దోర్దండి? పెట్టెయెక్కడ? ఏమో! ఎవరికిఁ దెలియును?
ఆశ్చర్యమునొంది వెదకి వెదకి వేసారి, జల్లీ జగజ్జల్లులు పోయినట్లే
మరలి వచ్చి, "పెట్టెగాని, దోర్దండిగాని, కాళిగుడిలో తమకు
కనుపడలేదు. కడు జాగ్రతగా వెదకి వృథా ప్రయాసనొంది వచ్చి
తి"—మని విన్నవించిరి.

మైరావణునకు మిక్కిలి యాశ్చర్యముగ దోచినది. తనలో
ఏమో? యద్భుతముగా నున్నది? గుడిలో పెట్టెలేదా? దోర్దండి లేదా?
నేను తెచ్చిపెట్టిన పేటిక యెందు బోయినది? ఒకవేళ నా మర్కటుండు
రామలక్ష్మణుల నుంచియున్న పెట్టె గుడిలో నున్నదని తెలిసికొని,
దానిం గొనిపోయి మఱి యెచ్చటనేనియు దాచియుండునా? అలాగు
జరిగియున్నను, దోర్దండి లేకపోవుట కేమి కారణమైయుండును? "అభి
షేక జలమును గొనివచ్చి గుడిలోఁ బెట్టుకొని యుండుమని గదా?
ఆజ్ఞాపించితిని. ఇంతలో పెట్టెయు, నదృశ్యగువయును గాన రాక
పోవుట యెట్లు? నా మాయలకు మించిన మాయగా యున్నది.
ఈ వింతకు నిమిత్త మెటులఁ దెలియును? హనుమంతుని వెంట మఱి
యొకఁ డెవ్వఁడైనను వచ్చియుండి యాపేటికను గొనిపోయి యుం
డునా? అది యెట్లు సాధ్యమగును? ఈ పురములోనికిఁ జేరనంత్రస్సు
నాకుకాని వాఁ డెవ్వఁడైనప్పటికిని నేను బ్రతికియుండగా, నిందుండి
మరలి పోవుటకు శక్యమగునా? అవ్విధమునఁ గదా? బ్రహ్మచే
వరమును బొందియున్నాను. ఆలాగున జరుగుటకు వలను గాదు.

జరిగియుండదు. ఏదో యిది తంత్రముగా దోఁచుచున్నది ఈ వచ్చినకోతి వానికి లోఁబడి దోర్దండి యాపేటి కొనిపోయి పెట్టుకొని యెందైనను దాగి యున్నదేమో'' యని పెక్కు తెఱంగులఁ జింతించి, తన ప్రయత్నమునకు భంగము వాటిల్లెనని వగచి, "హనుమంతునిఁ జంపిననేగాని యుద్దేశించిన పనిని నెరవేర్చుట కింక వలనుగా''దని నిశ్చయించి, మరల జల్లీ జగజ్జల్లులం బిలిచి "విరోధి మాటలకు లోఁబడి దోర్దండి పెట్టెను గొనిపోయి యెందైనం బెట్టుకొని కానరాక దాగి యున్నదేమో, కాదేని యాబిడ కనఁబడకుండుటకు కారణము గలుగదు. కావున మీరు వెండియుం జని పురంబున రహస్య ప్రదేశంబుల నన్నియెడలను జాగ్రతగా వెదకుఁడు. ఉపేక్షింపఁ దగిన పని గా''దని చెప్పి పంపెను. వారతని యనుజ్ఞను గొని వెదకుటకై వెడలిపోయిరి. మైరావణునకు మాత్రము సంశయము తీరినది కాదు. మహా బల పరాక్రమశాలురైన సేనాధిపతులు హనుమంతుని నెట్లైనం జంపి రాగలరనియు అటుమీఁదట తానెంచిన పని నెరవేఱఁగలదనియుం దలంచి, వారికై నిరీక్షించుచుండె.

## హనుమంతునిచే, నుద్దండ మహోద్దండులు చచ్చుట.

అట నుద్దండ మహోద్దండులు మహాపరాక్రమముతో మారుతాత్మజునిం దాకి యతనిపై శరవర్షమును గురిసి, పలువిధములైన యాయుధములతో నొప్పించుటయు, నయ్యగచర సత్తముఁడెంతయు నొచ్చి, మహదాగ్రహముతో ప్రళయకాళరుద్రుని తెఱంగు నుగ్రమూర్తి దనర, దిక్కులు భేదిల్లు లాగున నార్చి పరిఘను బూనిమింటికెగిరి, మహాశైలంబుపై నుండి పడిన తెఱంగున నుద్దండుని తేరుమీఁద గుభాలున దుమికెను. దుముకుటయు, నయ్యరదంబు మార్ణంబయ్యె. నవు డారక్కసుండెటులనో తప్పించుకొని, గదను గొని యాంజనేయునిం దాకిన, నిరువురకును భయంకర యుద్ధము జరుగఁదొడంగె. ఆశ్చర్యకరమగు వారి పోరాటమునుగాంచి యేమి చేయుటకును దోఁచక సైనికులు వెఱగుపడి యంతంతటనిలిచి చూచు చుండిరి.

అపుడు పవన నందనుండు తనలో "ఓహో! నాలవజాము ప్రారంభముగా నున్నది. ప్రొద్దుచాల గడచిపోయినది. ఈరక్కసులతో నివ్విధంబున బెనగుచు కాలహరణముఁ జేసినయెడల వచ్చిన పనిని నెరవేర్చుకొని పోవుట యెట్లు! చేయవలసినపని యింకనుం జాలగలదు. సూర్యోదయమగుటకు పూర్వమే నేను రఘువీరులం గొని సుగ్రీవాదులయొద్ద కరుగవలయును గదా? తడవుగావింపకూడ" దని యెంచి గదను గిరగిరం ద్రిప్పి వ్రేయుటకై తనమీఁదికి వచ్చుచున్న యుద్దండుని వ్రేటుం దప్పించుకొని తటాలున నెగసి వాని యురంబును బెట్టుగా దన్నెను. ఇంద్రుఁడు పర్వతంబు నేసిన వజ్రాయుధంబు వ్రేటునుంబోలె, యాతాపు దగులుటయు, వానిరొమ్ము బ్రద్దలుగా బగిలి నోటను, ముక్కులను నెత్తురు పెల్లుగా వెడలుచుండ దిగ్గన నేలఁబడి గిజగిజ దన్నుకొని ప్రాణంబులు విడిచె.

ఉద్దండుండు పడినది చూచి, మహోద్దండుఁడు మహోద్దండ దండ ధరాకారుండై మండుచు, మరుత్సుతుని దరియ తేరుఁదోలించి, యార్చి యట్టహాసం బొనరించి, తన సామర్థ్యం బేర్పడునటు వాఁడి మిగుల బలుతూఁపులు బరపి, యలంచిన, హనుమంతుఁడు బాణ ఘాతములచే నొచ్చి, నెత్తురులురుల పూఁచిన మోదుగునుం బోలె గనుపట్టుచు, కోపంబు మించుటయు, నుద్దండుండు నేలఁబడచియున్న గదనుగొని, తేరుమీఁదికి లంఘించి, బెట్టిదంబుగాఁ ద్రిప్పి మోదుటయు, నవ్వ్రేటుచే మహోద్దండుని భుజంబొకటి మొదలంట దునిఁగి క్రిందఁబడెను. వాఁడు నగరంబంతయు బెగ్గడిల్లులాగునవార్చి వాలును గొని, యాంజనేయునిఁ దెగనేయ గమకించుటయు, నమ్మేటివీరుండు ఖడ్గంబునొడిసి గైకొని, వాని రెండవ భుజంబును ఖండించి, తేరును గుఱ్ఱములను ధ్వంసము గావించెను.

వాఁడు మిగుల నాగ్రహముతో దిక్కులు బగులులాగున నార్చి కొండ గుహనుం బోలె నోరుఁదెఱచుకొని రక్తసిక్తాంగుఁడై హనుమంతు మ్రింగవచ్చెను. అమ్మహావీరుండైన వానరోత్తముఁడు "ఔరా! ఇంకను నీ పోతర ముడంగలేదా?" యనుచు గదతో పిడుగుపడిన విధమున వాని తలపై బలమైన యొకవ్రేటు వేసెను. ఆదెబ్బతో మహోద్దండుని శిరంబు వ్రక్కలై, వాఁడు నేలగూలె.

అంత హనుమంతుఁడు వానికి సహాయుఁడై వచ్చి, చావగా మిగిలి యున్న రక్కసులను మర్దించి యమపురంబుఁ జేరునట్లుజేసి, మైరావణ వధోపాయంబును గూర్చి యోచించుచు తోరణస్తంభముపైఁ గూర్చుండెను. కాని యతఁడు తలంచి నట్లు పాతాళ లంకేశునిఁ జంపుట సులభముగాని పని యేర్పడినది. దెబ్బలుదిని పాటిపోయిన యొకరిద్దరుని నిశాటులు మైరావణుని చెంత కరిగి, యుద్దండ మహోద్దండులును, వారి సేనయును నిర్మూలం బగుట నెఱింగించిరి. వనచరుని బల పరాక్రమంబు దలంచి యచ్చెరువొంది, ఇంద్రాది "దేవతలను సయితము చీరికిఁ గొనని శక్తి యుతులగు తన సేనానాయకుల నొక వానరుండు వధించెనుగదా ?" యని వగచి, ఏవిధమున నేనియు వాయుపుత్రుని మడియింప వలయునని యుద్దేశముతో, ఘటోదర, కిటిముఖ, జ్వాలావక్త్ర, విభీషణ, రక్తాక్ష, ప్రముఖుల, పేరుపొందిన మహావీరులం గొందఱను రావించి హనుమంతుని వధింపుఁడని యాజ్ఞాపించెను. ఒక్కొక్కఁడే లోకంబంతయుం గబళింపఁ జాలినవారై యొప్పుచుండెడి యా యసుర వీరులు 'మహాప్రసాదం' బని వీడ్కొని చని, మహా బలీయులగు నాలుగుకోట్ల దనుజులతోఁ గూడి, వరుసగా, సింహ, వ్యాఘ్ర, భల్లూక, శరభ, భేరుండాది. వాహనము లారోహించి వివిధాయుధంబులు దాల్చి, పాతాళ లోకంబు గ్రక్కదలగాఁ గదలి, వాద్య ఘోషములును, భయంకర గర్జన ధ్వనులును నతిశయింపగా రయంబునఁ నగరి తోరణస్తంభముపై నుండు వాయుపుత్రునిం జుట్టుకొని, బాణములచేతను నాయుధంబులచేతను మిక్కిలి నొప్పించిరి.

ఆంజనేయున కత్యంతమైన కోపము గలిగినది. రౌద్రాకారుఁడై పరిఘను బుచ్చుకొని తనలో "వాఁడేడీ? ఆ పాపశీలుఁడు. మైరావణుఁ డెక్కడనున్నాఁడు. వాఁడురాక. యీ యధమ రాక్షసుల గుంపు వచ్చినది. ఏమి ప్రయోజనము ?" అని తలంచుచు క్రిందికి దుమికి, యసుర సేనలోఁ జొచ్చి, మందించిన సింగంబు, జింకల గుంపులోఁ బ్రవేశించినట్లును, మత్తకరి తామర కొలనులోని కరిగినట్లును, దైత్య బలంబులను ఛిన్నాభిన్నంబుఁ గావించి, మొత్తములుగా చచ్చి నేలఁ గూలునట్లు మర్దించి, మొనగాండ్రని యెన్నికకెక్కిన ఘటోదరాదుల నొరికనైన తప్పక యొడలున నెత్తురు గాఱ

లాగున మోదిన, వారు మిక్కిలి నొచ్చియుఁ జలింపక, నెదిరించి, పోరఁ దొడంగిరి.

అటుల భయంకరముగా సమరముఁ జేయుచున్న సమయమున యాదనుజ వీరులలో, ఘటోదరుఁడను వాఁడనిల నందనునిపై వెల్లుగా, మింటికెగిరి రాళ్లవానఁ గురియించె. కిటిముఖుండు, ప్రచండమగు గాలి నిఁబుట్టించె. జ్వాలావక్త్రుఁడు మంటలు బుట్టించి మీఁద బర్వునట్లు గావించె. విభీషణుఁడు పెను ధూళింగప్పె. రక్తాక్షుండు, శర నికరంబుఁ బరపి, యంధకారం బతిశయించునట్లు జేసె. ఇవ్విధమున నొక్కొక్కరు నొక్కొక తెఱంగున సంకటము గలిగించి యలంచుటయు, మహా సమర్థుండయ్యును, కేసరీ పుత్త్రుం డెట్లు చేయుటకును దోఁచకయు, వలను గాకయుఁ జిక్కువడి, సత్క్రియా దీక్ష వహించిన తనకు సహాయులై రక్షింపుఁడని తనలో త్రిమూర్తులను, పంచ భూతములను, దిక్పతులను, నవగ్రహంబులం దలంచి ప్రార్థనగావించి, పుణ్యపురుషులగు కౌసల్యా, సుమిత్రాత్మజుల యాపన్నివారణ కార్యార్థియై వచ్చిన తనయందు కరుణాదృష్టులం బరపి, కర్తవ్య ప్రకారంబు నాదేశించిన, పరమ పావనియు, జగన్మాతయునైన భద్రకాళి సంస్మరించి యిట్లని స్తుతించె.

చ॥ అసమమహాప్రభావమున - నగ్గలపుం గృపనెల్లలోకముల్
విసువక సర్వదా వెలయు - వేడుకమైనొగిఁ గాచుచుండుసా
రసరిపుమౌళి రాణిశుభ - లక్షణశోభిత కీరవాణియా
యసురులమా యలందొలఁగు - నట్లుగఁ జేయఁ గదమ్మ శాంభవీ!

కథాసరణి - డోరా.

తడవగుచున్నది జాము రాత్రినూ - త్రం బేగలదింక
మడియుగ లేదీవరకును దుష్టుఁడు - మైరావణుఁడతనిఁ
జంపిగాని నేరఘువీరులఁ గొని - చనఁగ తరముగాదు
పెంపగు కరుణాదృష్టులఁ గనిగెలి - పింపుమునను జననీ!

అని స్తుతించిన, తత్క్షణంబ యారక్కసులు చేయుచున్న మాయాకృత్యములు భద్రకాళి కృపావిశేషంబువలన, సూర్య రశ్మిచే తొలంగిన మంచువలె పటాపంచలయ్యె. పరిపూర్ణమైన దైవ

సహాయము గలవానికి, మహాపర్వతములు బెండువలెను, సముద్రములు పిల్లకాలువల వలెను నగుచుండును గదా ! హనుమంతుని కృత్యములు నిరాటంకముగా నెరవేరుచుండుటలో, నతిశయమేమిగలదు? అతఁడు దైవబలము గలవాఁడు. కావున తలంచిన పనులన్నియు ననుకూలించుచుండును. కాళి మహిమచే, ఘటోదరాదుల కృత్యములు వమ్మగుటయునన నిలజుండు సంతసించి విజృంభించి వారలపైఁ గవిసి, వీరావేశం బతిశయింప, నయ్యసుర బలంబులను పరిఘతో మోదియు, చేతులతో నలిపియు, కాళ్ళతో నేలఁబడవైచి రాచియు, తోఁకతోఁజుట్టి త్రిప్పి భూమిమీఁద నలియునట్లు గొట్టియు, నిర్మూలించి సైన్యనాయకులుగా వచ్చిన వారలను దిట్టతనంబుతో నొక్కొక్కనిఁగాఁబట్టి పడఁగొట్టి నిరవశేషం బొనరించి, మైరావణ వధోపాయంబు నెంచుచు, తోరణస్తంభంబుపైఁ గూర్చుండె.

అంత సమర వృత్తాంతంబు నంతయు విని మైరావణుఁ డాంజనేయుని బలపరాక్రమంబుల కెంతయు విస్మయించి, ఎట్లును నతని సంహరించియే తీరవలయు ననెడి దృఢసంకల్పము గలవాఁడై, చండ, ప్రచండ, విబుధద్వేషి, యజ్ఞధ్వంసి, ఘూకనేత్ర, సింహవిక్రమ, శూలరోమ, కంటక, కుటిలదంత, మహాశిర, నామములుగల యధిక బలపరాక్రమ వంతులగు పదుగురు పరవీరభయంకర దనుజ వీరులం బిలిచి " వింటిరా ? ఎట్లో మహాసత్వసంపన్నుండైన హనుమంతుఁ డనెడి మర్కటుఁడు రేయికిరేయిగ మనపట్టణంబునకువచ్చి, యిందు గల, లెక్క యిడరాని సత్వవంతులను మనయసురవీరులను సంహరించెను. పేరొందిన మేటి రక్కసుల లెల్లరును వానిచే నిహతులైరి. వాఁడు యింతకు మున్ను దశముఖ పాలితం బగు లంకాపురంబుఁ జొచ్చి, పెక్కండ్రు రాక్షసులం జంపి, యా నగరంబును గాల్చి, పెక్కు దుండగము లొనరించి పోయెనఁటం యిపుడు మన పురంబునందు నయితము నిశ్చయముగా మనసేనలం జంపుచు తోరణస్తంభంబునొద్ద నున్నాఁడఁట. మీరు శీఘ్రముగా ప్రబల దలంబులతోఁ బోయి వానిని పుడమిఁ బడఁగూల్చి, యతి శీఘ్రముగా నరుగుదెండు పొం " డని యాజ్ఞాపించె.

ఆమేటి రక్కసులు తమ యేలిక యాజ్ఞను తలఁదాల్చి "మహాప్రభో! అసురవల్లభా! కోతి యొకటి గొప్పసైన్యములను, శూరాగ్రేసర సముదయంబును హతిమొనరించెనని మీరు పలికిన మాటలు వినఁగా మాకు మిగుల నాశ్చర్యముగాఁ దోఁచుచున్నది. ఎంతబలము గలిగి యుండినను కోతియే గదా? దానికింతగర్వమా? మొదటనే మీరు మమ్ముఁ బనిచియుండవలసినది. ఆపుడే మర్కటునిపొగ రడఁగించి యమపురమునుజేర్చి యుండుదుము. ఆలంకాపట్టణములోనాడిన వానియాటలు మన నగరములో మనముందటఁ జెల్లునా? వాఁడెంత? వానిబలమన నెంత? ఈక్షణంబ మేము పోయి పసుగురమును, సాధ్యమగునంత వరకును బ్రయత్నించి వానిని మీసన్నిధానమునకు పట్టితెచ్చెదము" అని భుజంబులు దట్టి ప్రగల్భోక్తులు పలికి యట గదలి, తమతమకుం దగినవియు, సకలాయుధములతోఁ గూడినవియు, పిశాచముఖ గార్దభంబులు బూన్చినవియు నైన రథంబులారోహించి, జముని సయితము చీరికిఁ గొనని యుద్దండ కలితులగు నేడుకోట్ల వీరభట సముదయంబును వెంటఁగొని మిక్కిలి యాడంబరముతోఁ బోయి, వారి రాకంగని యుగ్రుండై ధ్వంసమొనరింప వలయుననెడి యుద్రేకముతో నుండెడి యాంజనేయుని సమీపించి, "ఓహో! అదుగో! దుష్ట మర్కటుఁడు. పాఱి పోవలేదు. ఉన్నాఁడు. ఉన్నాఁడు. ఇంకఁ జచ్చినవాఁడే! మన దృష్టికిఁ దోచినంతట వీనికి బ్రతుకెక్కడిది? చుట్టుముట్టి, సొక్కి సోలి తోరణస్తంభము మీఁదఁ బడునట్లు మీమీ యాయుధంబుల నుపయోగింపుడు. చావక యుసురులతో నుండినేని, మన దొరయొద్దకుఁ గొని పోవుదము. లేక చచ్చెనా? చావనిండు. ఎటులనైనను మేలేయగును" అని యొండొరులు, బెట్టుగాఁ బలుకుకొనుచు, పరశు, పట్టిశ, భిండివాల, శక్తి తోమర, కరవాల, చక్ర, గదా, కుంత, త్రిశూల, ప్రముఖ బులైన యాయుధంబులం బ్రయోగించియు, క్రూర శర నికరంబును బరపియు, తమ సామర్థ్యంబంతయు వినియోగించి హనుమంతునిఁ జంపుటకుఁ బ్రయత్నించిరి.

హనుమంతుఁడు సేనాయుతంబుగా చండాదులగు రాక్షసవీరులఁ బోరిగొనుట.

భగవత్కరుణా విశేషంబువలనను, భద్రకాళి యనుగ్రహంబు చేతను, క్రూరులైన యా నిశాటులు ప్రయోగించుచున్న యాయుధంబులవలన ననిలసుతున కిసుమంతయును బాధ గలుగకుండుటయె గాక యా సాధనములతని మేనుదాకి పొడి పొడియై రాలుచుండె. ఆ తెఱంగుఁ జూచినంతట, చండ ప్రచండాది వీర దశకమున కాశ్చర్యము గలిగినది "బళీ! కొండల నేనియుం బిండి చేయఁగల మన యాయుధంబులు గాని, మన భుజ బలంబుగాని, యీకోతి వానిపట్ల నిరుపయోగ మగుచున్నది. ఇది యేమి వింతయో తెలియలేదు. వీఁడెద్దియో, జాలవిద్య నేర్చినవాఁడని తోఁచుచున్నది. అగు గాక వీని టక్కుటమార విద్యలు మనయొద్ద ఫలించునా? చూతముగాక" అని యుగ్రులై గర్జనఁ జేయుచు, నార్చుచు, బెదరించుచు, మఱి మఱియుం దమవలన నైనంతవరకును వానర యూధ ముఖ్యునయ్యంజనీ నందనునిఁ జంపుటకు యత్నించిరి. కాని వారి కడంక కొనసాగినది కాదు. ఇట్లు వారు గడిసి వివిధ సాధనంబులను దన మీఁదఁ బ్రయోగించుచుండగా, పరిఘూహస్తుండై, పరాక్రమ వంతుఁడా మరుత్సుతుఁడు, దిగ్గన తత్సైన్య మధ్యమున దుమికి, యెండిన యడవిలో కార్చిచ్చు బొడమిన విధంబున కోపాగ్నిచే బ్రజ్వలింపుచు, పరిఘతో మోదియు, పాదంబులు గ్రహించి త్రిప్పి నేలఁగొట్టియు, దన్నియు, నవయవంబులు విరిచియు, నొకనితో నొకని ద్రేసియు, తోఁకతోఁ గొట్టియు, నఖములతోఁ జీల్చియు, గఱచియు, నేలరాచియు, మారి మసంగిన చందమున, మేకలగుంపులో బెబ్బులి ప్రవేశించిన తెఱంగున, ఛిన్నాభిన్నముఁ గావించి, విచిత్ర విహారం బొనరించిన, పగిలిన తలలును, విఱిగిన యంగంబులును, గిజగిజ దన్ను కొను మొండెములును, తునిసిన యెముకలును, గలిగి యాయుద్ధరంగము నెత్తురు వెల్లువలు పారుచుండ, శవమయంబై, భయంకరమై కనుపట్టుచుండె.

చావక మిగిలిన రక్కసులు. "ఓయబ్బా! వీఁడు వానరుఁడుగా దోఁచలేదు. రాక్షసకులమును నిర్మూలముఁ జేయుటకై వచ్చిన

కోతి రూపుదాల్చిన మృత్యువుగాని వేఱుగాదు. అయ్యో! తెలియక వచ్చితిమి. వీనిబారిం జిక్కితిమి. బ్రతుకుటెట్లు? తప్పించుకొని పోవుటకు వెరవెయ్యది? వీనిచే జావవలసినట్లు విధాతమన నుదుట వ్రాసెను కాఁబోలు" నని వాపోవుచు, ఎటుచూచినను తమ కన్నులకు హనుమంతుని యాకృతియే దోఁచుచుండ, దీనులై యరచుచు, నే వంకకు దిరిగినవాఁ డావైపునకు తిరిగి చూడక, వస్త్రంబులు సడల, తలలు వీడ, నాయుధంబులు పడవైచి మహా భీతితో పరుగెత్తి పోయిరి.

అపుడు చండ ప్రచండాదులగు రథికులు వదుగురును, హనుమంతుని విజృంభణమును, తమ దళంబులకుఁ దొడరిన దుర్దశయుంజూచి, మహాదాగ్రహంబున, త్వరితముగ రథంబులను దోలించుకొని పోయి, పాఱిపోవుచున్న హతశేష పదాతి సముదయంబు నడ్డగించి ధైర్యంబు గఱపి, మొక్కమొగంబ్లు జేసి కూర్చుకొని యతిరభసంబునఁ జనుదెంచి హనుమంతుని ముట్టడించిరి.

మెఱపు మెఱసిన రీతిగా మారుతి రెప్పపాటులో మింటికెగసి, చండుని తేరుపై దూకెను. ఆయతిభారము గల యతని దూకుడచే రథమును, గుఱ్ఱములును చండుఁడును రూపమే తెలియ పిండిపిండియై కూలెను, వెంటనే ప్రచండ ప్రముఖుల యరదంబులం గూల్చుఁ బూని యొక్కొకటిగా విఱుగఁదన్ని నాశ మొనరించిన వారు తొమ్మండుగురును విరథులై కోపావేశంబు రెట్టింప, సింహనాదములు సేయుచు వరుసగా, కుంతమును, పరశువును, ముసలమును, కరవాలమును, గదయును, శక్తియు శూలమును, ముద్గరమును, తోమరమునుం గొని యొక్కసారిగ నంజనేయునివల యాకారముగ జుట్టి నిలిచి, తమ తమ యాయుధంబుల నతనిపైఁ బరగించిరి. కాని యావనచరవీర ముఖ్యునకు వారి యాయుధములు గడ్డిపోచతోఁ గొట్టినంత మాత్రము కూడ దేహమునకుఁ దగులలేదు నూవుగింజంత గాయము సయితము గలిగినది కాదు. ఆవింతం జూచి రక్కసుల మొనగాండ్రు. విస్మయమొంది, వెల, వెలఁబోయి విసుగుఁగొని యలసి నిలిచిరి. హనుమంతుఁ డదియ మంచి సమయమని యెంచి, యలుపుఁజెంది యధిక సత్యాహీనులై

